# ఆంధ్రప్రదేశ్

సంపుటి : 21 | జూన్, 1977 జ్యేష్ఠ-ఆషాఢ, 1899 శా.శ. | సంచిక .8

ప్రధాన సంపాదకులు :
శ్రీరాజ్యం సిన్హా

సంపాదకులు :
కుందుర్తి ఆంజనేయులు

ముఖ చిత్రం : బందరు కలంకారీ

రెండు, మూడు కవరు పేజీలు: కందుకూరి వీరేశలింగం జీవిత చరిత్ర (బుజ్జాయి బొమ్మల చిత్రాలు)

చివరి కవరు పేజీ : పదండి పోదాం పైపైకి! (ఫొటో : శ్రీ ఎం. జ్ఞానేశ్వరగౌడ్)

వెల: 50 పైసలు

సాలుచందా : ఆరు రూపాయలు

ప్రచురణ :
డైరెక్టరు,
సమాచార, పౌర సంబంధ శాఖ,
హైదరాబాద్

ముద్రణ :
డైరెక్టర్,
ప్రభుత్వ కేంద్ర ముద్రణాలయం,
హైదరాబాద్.

రిజిస్టరు నెం : హెచ్. హెచ్. డి. 81

ఈ సంచికలో రచయితలు వెలిబుచ్చిన అభిప్రాయాలు తప్పనిసరిగా ప్రభుత్వానికి చెందినవిగా భావించనక్కరలేదు.

10—1

## ఈ సంచికలో...

పేజీ





# మా తృ గీ తి

ఈ ప్రకృతి నిండా నా కాశ్యపీ పరిమళాలు
ఈ ఖండమంతటా నా గౌతమీ ప్రవాహాలు
ఈ నభస్సును చుంబిస్తున్న నా హిమాలయం ఉవ్వెత్తు
ఈ జగమంతా సురభిళిస్తున్న కాశ్మీరం నాసొత్తు
నేను శీతగిరి నించి సేతువు దాకా చేతులు చాచాను
నేను పశ్చిమం నుంచి ప్రాగ్దిశ దాకా వ్యాపించాను
ఉదయిస్తున్న సూర్యబింబం నా నుదురుపై దీపించే తిలకం
ప్రాచేతసుని వాణితో పవిత్రమైన నాహృదయం అతిమధురం
సత్యంకోసం సర్వస్వంకోల్పోయినా వెరవని హరిశ్చంద్రుని వంశంనాది
మనిషిగా పుట్టి మాధవుడైన కోదండరాముని కులం నాది
అజాత శత్రుడు ధర్మజుడు మాకుప్రాపు
అహింసవైపు జాతిని మళ్ళించిన గాంధీ మాబాపు
నా నుడిలో మొగల్ దర్బారులో వెలిసిన జగన్నాథుని బింకం
నా పద్యంలో జయదేవమహాకవి మలచిన అష్టపదుల పొంకం
నా హృదయం నిండా అలదుకున్నాను రామమోహనుని సంస్కార విభూతి
నా నాలుకపై నాట్యమాడుతున్నది ఇక్బాల్ జనప్రియగీతి
ఈ పర్వతాలూ-పచ్చని వనాలూ నా గతాన్ని జ్ఞాపకం చేస్తున్నాయి
ఈ నదీనదాలూ-వాగులూ వంకలూ సంస్కృతి ప్రవాహాలై
నా వైభవాన్ని గానంచేస్తున్నాయి
ఈ గడ్డపైనేను తాకే ప్రతిమట్టిపెడ్డలో నా జాతీయత పరిమళిస్తున్నది
ఈ నేలపై జన్మించిన నేను ఈమె కోసమే రాలిపోవాలనే సందేశం
ప్రకృతిలో వినిపిస్తున్నది

ఈ పుణ్యధాత్రి, వేదభూమి, భారతి, కళ్యాణి
ఈ యశోగాత్రి, కారుణ్యనేత్రి భారతి నా జనని!

“ తిరునగరి ”

# ఆంధ్ర ప్రదేశ్ గవర్నర్ సందేశం



నేడే ఆంధ్రప్రదేశ్ గవర్నరుగా పదవిని స్వీకరించినాను. ఈ సందర్భంగా ఎంతో వైవిధ్యంగల యీ విశాల రాష్ట్ర ప్రజల సౌభాగ్య అభివృద్ధికి, శాంతి భద్రతల సంక్షేమ కృషికి అంకితం కావడం నా బాధ్యతగా భావిస్తున్నాను. ఇక్కడ కొన్ని ప్రాంతాలను ప్రకృతి కరుణిస్తున్నది. మరికొన్ని ప్రాంతాలమీద శీత కన్ను వేస్తున్నది. దేశంలోని యితర ప్రాంతాలలో మాదిరిగా, కొద్దిమంది సౌభాగ్య సంపదలతో తులతూగుతూ లక్షలాది మంది పురుషులు, స్త్రీలు, పిల్లలు కటిక దారిద్ర్యం, అష్ట కష్టాలు పడుతున్నారు. ఈ పరిస్థితుల దృష్ట్యా మారుమూల గ్రామాలకు సయితం అదేవిధంగా సాంఘిక, ఆర్థిక సత్వరాభివృద్ధికి మనం కృషిచేయాలి.

ఆంధ్రప్రదేశ్ వ్యవసాయ రంగంలో సాధించిన అభివృద్ధి గర్వకారణమైనట్టిది. బియ్యం, పొగాకు ఎగుమతులకు, రుచికరమైన ఫలాలకు, బొగ్గు, యితర ఖనిజాలకు, పారిశ్రామిక అభివృద్ధికీ యీ ప్రాంతం కాణాచి. ప్రస్తుతపు విద్యుచ్ఛక్తి సమస్యలు పరిష్కారమైనప్పుడు పారిశ్రామిక ప్రగతి మరింత పుంజుకుంటుందని నేను విశ్వసిస్తున్నాను. ప్రకృతి ప్రసాదించిన సుదీర్ఘమైన కోస్తా ప్రాంతం, విశాఖపట్నంలోని హిందుస్థాన్ నౌకా నిర్మాణ కేంద్రం వంటి పబ్లిక్ రంగ పరిశ్రమలు, నాగార్జున సాగర్ వంటి భారీ నీటి పారుదల ప్రాజెక్టుల ద్వారా ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం ఆధునిక సాంకేతిక, ఆర్థిక అభివృద్ధి రంగాలలో నూతన శిఖరాలను అందుకోటానికి సంసిద్ధంగావుంది.

అయితే యీ పెట్టుబడులు, అభివృద్ధి పథకాల ఫలితాలు గ్రామాలలోని సన్నకారు రైతులు, వ్యవసాయ కార్మికులు, నగరాలలోని ఫ్యాక్టరీ కార్మికులు, మధ్యతరగతి ప్రజలకు అందాలి. పార్లమెంటు చట్టాలు ఎన్ని ఉన్నప్పటికీ సాంఘిక పరిస్థితులు కారణంగా యుగాల తరబడి అణగద్రొక్కబడిన అధిక సంఖ్యాక స్త్రీలకూ, కుల, మత, భాష, వృత్తి ప్రమేయాలు లేకుండా ప్రజలందరికీ యీ ఫలితాలు అందుబాటులోకి రావాలి. సాంఘిక న్యాయం లేకపోతే ఎంత అభివృద్ధి జరిగినా అది అసంతృప్తికే దారి తీస్తుంది. ఫలితంగా శాంతి సుస్థిరతలు కొరవడుతాయి. అందువల్ల అనేకసార్లు చెప్పినవే అయినా యింకా మనకు దూరంగానే వున్న లక్ష్యాలకు పునరంకితంకావాలి, అంటే మనకున్నది యితరులకు యివ్వడం నేర్చుకోవాలి. ఈ మన పురాతన భారతావని శ్రేయస్సుకోసం మనం నిజాయితీతో, భక్తిశ్రద్ధలతో బాధ్యతలు నిర్వహిద్దాం.

చారిత్రిక పరిణామాలద్వారా మనదేశం మనకు క్లిష్టమైన ఒక మహోన్నతమైన వారసత్వాన్ని సంక్రమింపజేసింది. వివిధ మతాలు, భాషలు, వివిధ కులాలు, సంప్రదాయాలు, ఆచారాలు గల ప్రజలతో మన మహోన్నత దేశాభివృద్ధికి మనం నిజాయితీతో పాటుపడదాం. మన జాతీయ ప్రధాన జీవనవాహినిలో యీ వైవిధ్యమంతటినీ మనం సంలీనం చేసికోవాలి. మన వారసత్వ సంపద సంగ్రహానికి ఆంధ్రప్రదేశ్ ఒక సజీవ ప్రతీక, యుగయుగాలుగా భారతదేశం పొందిన సమస్త అనుభూతులకు మన రాష్ట్రం ప్రత్యక్ష నిదర్శనం. శ్రీశైలం, వెంకటేశ్వర దేవాలయం వంటి ఆంధ్రుల మహోన్నత దేవాలయాలు, కాకతీయ రాజ్య, బౌద్ధ మత శిల్ప శిథిలాలు, చార్మినారు, మక్కా మసీదువంటి బ్రహ్మాండమైన కట్టడాలు, ప్రపంచ ప్రసిద్ధిగాంచిన సాలార్ జంగ్ మ్యూజియం, శిల్ప కళా వైభవోన్నతులు గుబాళించే యింకా అనేక యితర సుందర కళాసృష్టులు యివన్నీ ఆంధ్రుల సాంస్కృతికి, సంప్రదాయ వైదగ్ధ్యానికి నిదర్శనాలు.

మనం ఎటువంటి హోదాలోను వృత్తిరంగాలలోను పని చేస్తున్నప్పటికీ గతం నుండి సంక్రమించిన లోటుపాట్ల నుండి పరస్పర వైరుధ్యాల నుండి బయటపడడానికి కృషిచేయడమే ఇప్పుడు మనముందున్న ప్రధాన సమస్య.

సమీకృత సమైక్య రాష్ట్రంగా పురోగమించడంలోనే ఆంధ్రప్రదేశ్ భవిష్యత్తు యిమిడి ఉందనే విషయం మన ఆలోచనలలోను, ఆచరణలలోను ప్రస్ఫుటం కావడం చాలా అవసరం. కొంతకాలం క్రితం పెరిగిన ప్రాంతీయ వివాదాలు, జరిగిన ఆందోళనలవంటి వాటి వల్ల ప్రజల ఆత్మవిశ్వాసం దెబ్బతిని పురోభివృద్ధి కుంటుపడడం తప్ప ప్రయోజనం వుండదు. అటువంటివి కాలగమనాన్ని వెనక్కుమళ్లింపజూసే సంఘటనలు మాత్రమే.

నా పూర్వ స్నేహితులు, సహచరులు అనేకమంది రాష్ట్రంలోని వివిధ ప్రాంతాలలో ఉన్నారు. అనేక సంవత్సరాల సాహచర్యంవల్ల మా మధ్య అనుబంధాలు ప్రేమాభిమానాలు పెంపొందాయి. ఇప్పుడు ఆంధ్రప్రదేశ్ ప్రజలకు నా వంతు సేవ జేసే అపూర్వ అవకాశం నాకు లభించింది.

గవర్నరు పదవిలో ప్రజలకు సేవచేయడానికి ఉత్సాహంతో ఎదురుచూస్తున్నాను.



# రాయలసీమ వజ్రసంపద

—శ్రీ పింగళి పరశురామయ్య

విదేశాలనుండి వజ్రాలు కొనుగోలు చేయడానికి భారతదేశం సాలీనా 2.4 కోట్ల రూపాయలు వెచ్చిస్తున్నదని యిటీవల సేకరించిన లెక్కలు తెలుపుతున్నవి. ప్రపంచ వజ్రవ్యాపారసంస్థ అత్యున్నత స్థాయికి చేరడానికి భారత వజ్రవ్యాపారం హెచ్చుగా సహాయపడినట్లు రత్నాల వాణిజ్యచరిత్ర పేర్కొనుచున్నది. మనదేశపు ముడి వజ్రాలను సానపట్టుటకు సాలీన విదేశీకళాకారులకు కోటిన్నర రూపాయలు మనదేశం చెల్లిస్తున్నది.

మనదేశంలో, ప్రత్యేకించి ఆంధ్రప్రదేశ్‌లో కనుగొనబడిన రత్న సంపదలో వజ్రమే తలమానికము. అమూల్యమైనది: అతి సూక్ష్మరూపంలో లభించును ఆకర్షణీయమైన భూషణము. దీని గట్టితనము లోకవిదితము. తేలికగా రవాణాచేయుటకు అనుకూలమైనది. మన్నికకు పేరెన్నికగన్నది అపురూపవస్తువు. సౌందర్యరాశి. పారిశ్రామిక ప్రపంచంలో డైమండ్ డ్రిల్స్ గణనీయమైన పాత్రను వహిస్తున్నవి. శక్తివంతమైన ఫిరంగులు, తదితర యుద్ధయంత్రాంగం చేయడానికి అవసరమయ్యే అతిగట్టి ఉక్కును అయాప్రమాణములకు రూపొందించటానికి వజ్రం ఉపయోగపడుతుంది. అతి సున్నితమైన లోహపు తీగల తయారీలో గూడా వజ్రములకు స్థానము కలదు.

ఉత్తరభారతావనిలో వున్న పన్నా ప్రాంతం మినహాయిస్తే, భారతదేశం మొత్తంమీద ప్రపంచ ప్రఖ్యాతిపొందిన ప్రాచీన వజ్రపు గనులన్నీ ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలోనే వున్నాయి. కేంద్ర ప్రభుత్వం ప్రస్తుతం పన్నా పట్టణం సమీపంలో వున్న మజ్‌గాన్, షెయిడాన్, చందా ప్రదేశాలవద్ద వజ్రాన్వేషణ చేయుచున్నది. బొంబాయి మొగల్‌షరాయ్ రైలుమార్గంలోవున్న సత్నా అనే రైలుస్టేషనుకు 50 మైళ్ళదూరంలో వున్నది యీ పన్నా పట్టణం

## శ్రీ పింగళి వెంకయ్య

ఆంధ్రప్రదేశ్ అంతటా యిప్పటికి ప్రాచీనవజ్రపు గనులు కాననగును. చరిత్రప్రసిద్ధిగాంచిన కోహినూరు, ఆర్లాఫ్, దర్యా నార్, పిట్టు లేక రీజెంట్, నావక్ మొదలైన వజ్రములు యీ గనులనుండి లభించినవే. దురదృష్టవశాత్తు యీ పరిశ్రమ యెట్టి నిర్బంధములు లేని విదేశీ పోటీవల్ల అదృశ్యమైనది. బ్రిటన్ రాయల్ సొసైటీకి 297 సంవత్సరాలకు పూర్వం ఎరల్ మార్షల్ హోవర్డ్ సమర్పించిన నివేదికలో పేర్కొన్న ప్రాచీన వజ్రపు గనుల ప్రాంతాలను అన్వేషించే కార్యక్రమాన్ని. ప్రసిద్ధ భూగర్భ శాస్త్రజ్ఞులు శ్రీ పింగళి వెంకయ్యగారికి 1926వ సంవత్సరంలో వొక ఖనిజాన్వేషణ సంస్థ అప్పగించింది. ఆంధ్రప్రదేశ్‌లోని ప్రఖ్యాత గోల్కొండ వజ్రపుగనులను గురించి యూరోపియనులు రచించిన నివేదికలలో హోవర్డ్ నివేదిక అత్యంత ప్రామాణికమైనది. ఈ నివేదిక ననుసరించి పురాతన ప్రఖ్యాతి గల 38 ప్రముఖ వజ్రపుగనులు గోల్కొండ, నేటి బీజపూర్ ప్రాంతాలలో కనుగొనబడినవి. మరుగున పడిపోయిన యీ ప్రాంతాలను అన్వేషించి, గుర్తించడానికి, యింతవరకు అపరిష్కృత ఖనిజ సమస్యగా-అంటే సృష్టిలో యేరాతి నుంచి వజ్రము జన్మించినది విపులీకరించడానికి శ్రీ వెంకయ్య తమ జీవితంలో దాదాపు 10 సంవత్సరాలు అంకితం చేశారు. ప్రభుత్వభూగర్భశాస్త్రజ్ఞులు గుర్తించకపోయిన ప్రాచీన వజ్రపు గనులెన్నో వీరి కృషి ఫలితంగా వెలుగులోకి వచ్చినవి. శాస్త్రవిజ్ఞానమే లేని కొందరు యీ ప్రాచీన గనులలో యిక వజ్రములు దొరకవని, వున్న వజ్రములనన్నిటిని యెప్పుడో పైకి తీసివేశారని భావించవచ్చు. ఈ ఆలోచనలో పటుత్వం లేదు. 16, 17వ శతాబ్దములలో వజ్రములు రాజులు, మహారాజులకే అవసరమయ్యేవి. ఈ గనులలో పైపైన త్రవ్వకం జరిపి వారికి కావలసిన వజ్రములను సేకరించేవారేగాని కూలంకషంగా, అన్వేషణ జరిగేది కాదు. అందువలన యీ గనుల వజ్రసంపద యథాతథంగా వుండి తీరుతుందని ప్రముఖ శాస్త్రవేత్తల అభిప్రాయం. ఈ పరిశ్రమ పునరుద్ధరణకు యెక్కువ అవకాశములు గల ప్రాంతములను గురించి తెలుసుకుందాము.

## వజ్రకరూరు

అనంతపురం జిల్లాలోని గుంతకల్లు రైల్వే స్టేషనుకు దక్షిణంగా 10 మైళ్ళ దూరంలో యీ గ్రామం కలదు. యీ గ్రామానికి పడమర దిశలో ఒక చిన్నికొండ సమీపంలో ప్రాచీన వజ్రపుగనులు కలవు. ఈ గ్రామానికి తూర్పున వొకటిన్నర మైళ్ళ దూరంలో కొన్ని ప్రాచీన వజ్రపు గనులు వున్నవి. వీటిని స్థానికులు ‘ఎర్ర కొండగుంటలు’ అని పిలుస్తారు. వీటిలో దొరికే వజ్రములను గురించి హోవర్డ్ తన నివేదికలో యెంతో పెద్దవని, బరువు కలవని, యెక్కువ కాంతివంతమైనవని ప్రశంసించారు. యిప్పటికీ యీగనుల చుట్టుపట్ల ఉపరిభాగంలో వజ్రాలు కనిపిస్తూ వుంటాయి. భారీ వర్షం కురిసిన పిమ్మట

చలిదిమూటలు కట్టుకొని గ్రామస్థులు గనుల ప్రాంతాలకు వెళ్ళి గంటల తరబడి వజ్రములకై పరిశోధనలు జరుపుతారు. వర్షపు నీటికి మలినముపోయి తళుక్కుమని యెచ్చట వజ్రం ప్రకాశిస్తుందో ననే ఆశాభావంతో నలుమూలలా వెతుకుతూ వుంటారు. వజ్రములు లభించని సంవత్సరమంటూ వుండదు. వారివారి అదృష్టం కొలది హెచ్చు లేక తక్కువ ప్రాముఖ్యంగల వజ్రములు లభిస్తూ వుంటాయి. ఇక, మదరాసు, పూనా, హుబ్లీ తదితర ప్రాంతాలనుండి దళారులు ఈ వజ్రములను కొనుగోలు చేయడానికి ప్రతి సంవత్సరం వస్తూ వుంటారు.

## లత్తవరం

వజ్రకరూరుకు దాదాపు 15 మైళ్ళ దక్షిణాన ఈ గ్రామం కలదు. ఇచ్చటనే స్థానికంగా 'కొండగుంటల చేను' అని పిలువబడే మరొక ప్రాముఖ్యంగల ప్రాచీన వజ్రపుగని కలదు. హోవర్డ్ నివేదిక ప్రకారం, యిచ్చట లభించే వజ్రాలు చాలా తెల్లగాను, వొకవైపు మందంగాను, మరొక వైపున సన్నంగాను వుంటాయి.

## కొంగనపల్లి

అనంతపురం జిల్లాలోని గుత్తికి వాయవ్యంగా దాదాపు 10 మైళ్ళ దూరంలోవున్న ఈ గ్రామ ప్రాంతంలోకూడా వజ్రాలు ఈ రోజువరకు లభిస్తూ వున్నాయి.

## తుగ్గలి

కర్నూలు జిల్లా పత్తికొండ తాలూకాకు చెందిన యీ గ్రామంకు 2 మైళ్ళ దూరంలో, హోవర్డ్ ఉదహరించిన ప్రాచీన వజ్రపుగనులు కలవు.

ఇవిగాక కర్నూలు జిల్లాలోని బనగానపల్లి, రామళ్ళకోట, పగిడిరాయి, గిరిగట్ల; గుంటూరు జిల్లాలోని కొల్లూరు, భట్రుపాలెం; కృష్ణాజిల్లాలోని పరిటాల, బత్తెనపాడు, గని ఆత్కూరుల వద్ద యిప్పటికీ వజ్రాలు లభిస్తూ వుంటాయి.

కొల్లూరు గనినుండే చారిత్రాత్మక వజ్రం 'కోహినూరు,' పరిటాల ప్రాంతంనుండే కోహినూరుకు ఆరురెట్లు తూకంలోను, పరిమాణంలోను, హెచ్చిన 'పిట్టు లేక రీజెంట్' వజ్రం లభించినవి.

1677వ సంవత్సరంలో హోవర్డ్ సత్తెనపల్లి తాలూకాలోని కొల్లూరుగనిని సందర్శించినప్పుడు, అనుదినం 60 వేల మంది ఈ గని వద్ద పనిచేసేవారని, 6 శేర్ల తూకముగల వజ్రములు గూడా లభించేవని అతని నివేదికలో పేర్కొనబడినది.

17వ శతాబ్దం వరకు ప్రపంచానికంతకు వజ్రాలను సరఫరా చేసిన ఆంధ్రదేశంలో యీనాడు యీ పరిశ్రమ అదృశ్యం కావడం శోచనీయమైన విషయం. *



ఖమ్మం జిల్లాలో రూ. 12 లక్షల వ్యయంతో నిర్మించిన సత్తుపల్లి తాలూకా కార్యాలయ భవన సముదాయం



ఏప్రిల్ 26న ప్రపంచ బ్యాంకు నిపుణులు డా॥ గ్రోయిన్‌వాల్డ్, శ్రీ బ్రింబ్ అనంతపురం జిల్లా మార్తాడలో పాల సేకరణ సంఘం భవనానికి ప్రారంభోత్సవం చేశారు.

## వరకట్న సమస్య :

భారతదేశాన్ని పీడించే అతి క్లిష్టమైన సామాజిక సమస్యలలో వరకట్న సమస్య ఒకటి. ఒక విధంగా ఈ వరకట్న సమస్య సామాజికంగా మన వెనుకబడినతనాన్ని తెలియజేస్తున్నది. ఆర్థిక, రాజకీయ సమస్యలకు ప్రాధాన్యం ఇస్తున్నారే గాని, సాంఘిక సమస్యలను గూర్చి ఆలోచించేవారు మనలో చాలా తక్కువ. ఒక్క అస్సామ్‌లో తప్ప మిగతా అన్ని రాష్ట్రాలలో ఏదో రూపంలో వరకట్నం ఉన్నది. వరకట్న సమస్యను పరిష్కరించుటలో ఇబ్బందులు ఏమిటి, దానిని పరిష్కరించుటకు ముఖ్యంగా ఎవరు ముందుకు రావాలి అనేది ప్రశ్న.

# ఏమి ఖరీదెంత సార్?!

— శ్రీ ఇమ్మానేని సత్యసుందరం

మన సంఘంలో వున్న ముఖ్యమైన లోపము మానవతా దృక్పథం లేకపోవడం. ఒక వ్యక్తితో మనము పరిచయం ఏర్పరచుకొనినపుడు, మనము ఆ వ్యక్తి యొక్క వ్యక్తిగత లక్షణాలకు ప్రాధాన్యం ఇవ్వాలి గాని, అతని ఆస్తికి గాని, అతని అందానికి గాని మరి ఇతర వాటికి గాని ప్రాధాన్యం ఇవ్వరాదు. వ్యక్తిని వ్యక్తిగా గౌరవించే అలవాటు మనకు లేదు. పెళ్ళంటే నూరేళ్ళ పంట అంటారు గదా, వధువులు వరుడు వ్యక్తిగత లక్షణాలను గాని, వరులు వధువు వ్యక్తిగత లక్షణాలను గాని ఆలోచిస్తున్నారా? లేదు. పెళ్లి అనేటప్పటికి మిగతా విషయాలకే ప్రాధాన్యం ఎక్కువ. ఇందు వలన వరకట్నం లాంటి సమస్యలు మనలను వదిలి పెట్టుటలేదు. మానవతా దృక్పథం అలవరచుకొననిదే మనము సాంఘిక సమస్యలను పరిష్కరించలేము. విచిత్రమేమిటంటే, వరకట్నము వలన ఎవరు సుఖపడుతున్నారు ? అంటే ఎవరూ సుఖపడినట్లు కనబడరు. "మా అబ్బాయిలకు కట్నం తీసుకుంటే మా దగ్గర వుంటుందా ఏమిటి. మా అమ్మాయిలకు యివ్వాలిగా" అంటూ వుండటం మనం వింటూ వుంటాము. దీనిని బట్టి తెలిసేదేమిటంటే వరకట్నాన్ని పూర్తిగా నిర్మూలిస్తే నష్టపోయే వారు ఎవరూ లేరు. వివాహానికి సంబంధించిన చాలా సమస్యలు తీరుతాయి. ఈ విషయం అందరికీ తెలిసినా వరకట్నం మనలను పీడిస్తున్నది.

**మన సంఘంలో ఉన్న ముఖ్యమైన లోపం మానవతా దృక్పథం లేకపోవడమే!**

## అర్థంలేని సంప్రదాయాలు

మన సామాజిక వ్యవస్థ అర్థంలేని పురాతన సాంప్రదాయాల చేతులలో చిక్కుకున్నదని అందరికీ తెలుసు. అయితే విశేషమేమిటంటే సాంఘిక దురాచారాలు, మన అర్థంలేని సాంప్రదాయాల వలన బలవంతమగుచున్నవి. మన యువకులలో చాలా మంది కట్నానికి వ్యతిరేకులే. అయితే, వారు కట్నాన్ని ఎందుకు సహిస్తున్నారంటే, వరకట్న నిర్మూలనయందు వారికి శ్రద్ధ తక్కువ. కట్నం తీసికునేది, తీసుకోనిది పెద్దల బాధ్యత అని వారి భావన. మన సాంఘిక వ్యవస్థ విచిత్రమైనది. వధువుని ఎన్నుకొనుటలోనే వరునికి స్వేచ్ఛ లేనపుడు (పెళ్లి చూపులని ఏదో జరుగుచున్న వనుకోండి), ఇక కట్నం అంగీకరించుటగాని, వ్యతిరేకించుట గాని మన యువకులు చేయుటలేదు. అయితే, వరుని తల్లిదండ్రులు మాత్రం కట్నం కావాలి అని అంటున్నారు.

మనము సాంప్రదాయాలను అంటి పెట్టుకొని వున్నంత కాలం వరకట్నాన్ని నిర్మూలించటం కష్టం. పెద్దలు కుదిర్చిన సంబంధముతోనే మనము సరిపెట్టుకొని పోవుచున్నాము. "ఫలానా అమ్మాయి నాకు నచ్చింది. నేను ఆ అమ్మాయిని చేసుకుంటాను. ఈ సంబంధమే ఖాయ పరచండి" అని చెప్పగలిగే ధైర్యం, చొరవ మన యువతరంలో లోపించింది. ఏ సమస్యనైనా పరిష్కరించాలంటే ఎవరో ఒకరు ముందుకు రావాలి. పెద్దలు ముందుకు రావటం లేదు. యువతరం పెద్దల మాట వింటున్నది. ఇక సమస్య ఎలా పరిష్కారమవుతుంది ? కట్నం విషయంలో మనకి ఇదే జరుగుచున్నది.

జీవన వ్యయము పెరుగుచున్న ఈ రోజుల్లో ఆడపిల్లల తల్లిదండ్రులు ఒకో అమ్మాయి వివాహమునకు 20,000 రూపాయలు ఖర్చు చేయాలి. కనీసం 10,000 రూపాయలు ఇవ్వందే మంచి సంబంధం రాదు. 5000 రూపాయలు నగలుపెట్టాలి. ఇతర ఖర్చులు 5000 రూపాయలు. మొత్తం పెళ్లిఖర్చు 20,000 రూపాయలు ! ఐదుగురు అమ్మాయిలుంటే ఒక లక్షరూపాయలుండాలన్నమాట. మనదేశంలో ఎంతమంది తల్లిదండ్రులు ఈ భారాన్ని మోయగలరు ? అక్రమ మార్గాల ద్వారా డబ్బు సంపాదించి ఆడపిల్లల పెళ్లి చేయవలసిందే.

జరుగుతున్నదేమిటంటే చాలా మంది తల్లిదండ్రులు తమ కొడుకుల పెళ్ళిళ్ల ద్వారా కట్నాలు తెచ్చుకొని వాటిని తమ కూతుళ్లకు కట్నాలు ఇస్తున్నారు. ఈ విధంగా ఆడపిల్లల తల్లిదండ్రులు కూడా వరకట్న సమస్యకు బాధ్యులే. కొంతమంది ఎంత ఎక్కువ కట్నమిస్తే అంత గొప్ప అని అనుకుంటున్నారు. వీరిలో కొంత మందికి కూతుళ్లకు లేని కొన్ని పిచ్చి కోరికలు వస్తున్నాయి. "మా అమ్మాయిని ఏ డాక్టరుకో లేక ఇంజనీరుకో తప్ప ఇంకెవరికీ ఇవ్వము" అని గట్టిగా చెప్పేస్తున్నారు. ఇక వారు అనుకున్న సంబంధం దొరికితే ఎంత కట్నం ఇవ్వటానికైనా సిద్ధమే ! పెళ్లి కొడుకు ఎలావున్నా ఉద్యోగాన్ని బట్టి అమ్మాయి చేసికొనవలసినదే! ప్రాశ్చాత్య దేశాలలో లాగా మనము ప్రేమ వివాహములను సమర్థించనక్కరలేదు. కాని జీవిత భాగస్వామిని ఎన్నుకొనుటలో

మన యువతరానికి స్వేచ్ఛనివ్వాలి. "ఫలానా సంబంధం మాకు నచ్చింది. నీకు కూడ నచ్చుతుందేమో చూడు" అని పెద్దలు అనాలి. అంతేగాని, వాళ్ళకి నచ్చిన సంబంధాన్ని పిల్లలపై రుద్దరాదు.

మన సామాజిక వ్యవస్థలో వరకట్నం ఏవిధంగా పాతుకు పోయినదంటే, ఎవరైనా కట్నం తీసికోనని ప్రకటిస్తే, అతడు పిచ్చివాడని పెద్దల భావన. ఏదో లోపం వుండే వుంటుంది లేకపోతే కట్నం వద్దని ఎందుకంటాడు, అని లేనిపోని అనుమానాలు. పెళ్లి కూతురుకి రాని అనుమానాలు తల్లిదండ్రులకు వచ్చేస్తున్నాయి. కట్నం లేకుండా చేసికొన్నవాడిని గౌరవించక పోగా, అగౌరవ పరచడం మనం చూస్తూ వున్నాము. "కట్నం వద్దన్నాడేగాని మన వాడు పెద్ద ప్లానే వేశాడురా"అని అంటూ వుంటారు. కట్నం వద్దని కొడుకు చెప్పినా, బలవంతాన తల్లిదండ్రులు కట్నం తీసికొనటం. కట్నం తేని కోడలిని చాలా తక్కువగా చూడటం మనము చూస్తూ వున్నాము.

మనము వరకట్నాన్ని వ్యతిరేకించుటకు కారణం అది నిర్బంధంగా చెల్లించే డబ్బు అవటం వలన. అలా అని ఏ వ్యక్తి తన మామగారి ఆస్తిని ఏ మాత్రం అనుభవించ కూడదని కాదు. ప్రతి తల్లిదండ్రులు తమ ఆస్తిని కొడుకులకు, కూతుళ్లకు సమానంగా పంచిపెట్టటం సముచితం. అపుడే మనము ఇద్దరిని సమానంగా చూసి, సమాన న్యాయం చేకూర్చినట్లగును. వరకట్నం ద్వారా ఆడపిల్ల తన ఆస్తిహక్కును పొందుచున్నదని కొందరి అభిప్రాయం. ఇది సరిఅయినదికాదు. మగపిల్లలతో బాటు ఆడ పిల్లలకు కూడ ఆస్తిహక్కు వుండటం న్యాయం. ఆస్తిని పంచుకునే తీరు ఒకరికి ఒక రకంగా, వేరొకరికి వేరొక రకంగా ఎందుకు వుండాలి? ఎంతకట్నం ఇచ్చినా ఆస్తిలో వాటా పొందానన్న సంతృప్తి ఆడపిల్లకు వుండదు. ఎందుకంటె, కట్నం ఆమె అనుభవించటానికి వుండుట లేదు. వరకట్నం వుండుటవలన, తల్లిదండ్రులు కూతుళ్ళకి తమ ఆస్తిలో వాటా ఇచ్చుటకు ఇష్టపడుట లేదు. కట్నరూపంలో చాల ఖర్చు చేశాక కూడా, ఆస్తిలో హక్కు ఇవ్వడం అనవసరం అని వారి వాదన. ఇది నిజమే. సహజంకూడా. అయితే, ఇపుడు సమస్య ఏమిటంటే కట్నం ఎందుకివ్వాలి? ఆడపిల్లలకు ఆస్తిహక్కు లేకుండా ఎందుకు చేయాలి? మగపిల్లల ద్వారా కట్నాలు తీసికొని వాటిని ఆడపిల్లల పెళ్ళిళ్లకు ఖర్చు చేయు చున్నారు. ఇదొక విషవలయంగా తయారయినది.

స్త్రీలకు సరియైన విద్య ఇవ్వలేనంతకాలం, వారికి ఆర్థిక రక్షణ లేనంతకాలం, కట్నరూపంలో తల్లిదండ్రుల ఆస్తి కూతురు పొందుతే తప్పులేదని కొందరి వాదన. మనం కూడ కూతురు ఆస్తిలో వాటా పొందాలనే అంటున్నాము. అయితే కట్న రూపంలో కాదు. తన తోబుట్టువులతో సమానంగా ఆస్తిలో ప్రతి స్త్రీ వాటా పొందాలి. అదే న్యాయమైన మార్గము. అందువలన ఎవరికీ ఇబ్బందులు వుండవు.

వరకట్నాన్ని స్త్రీలేవ్యతిరేకించాలని, కట్నం లేకుండానైతేనే వారు పెళ్లి చేసికోవాలని కొంతమందిఅంటున్నారు. కాని మనదేశంలో ఇది సాధ్యమయ్యేపనికాదు. ఎందుకంటే, స్త్రీలు బాగా చదువుకుని




ఉద్యోగాలు చేస్తుంటే (విదేశాలలో వలె) ఇలా చేయటం సాధ్యం. మన స్త్రీలలో చాలమందికి చదువులు లేవు. ఉద్యోగాలు లేవుత అటువంటప్పుడు వివాహము మానుకొని ఇంట్లో కూర్చుండుట ఎంత మాత్రం శ్రేయస్కరం కాదు. అలాచేస్తే మానసికంగా కృంగి పోతారు. పురుషులకు విద్య వుంది. ఉద్యోగం వుంది. అందు వలన కట్నాన్ని ఎదిరించే శక్తి వారికి వుంది. అందువలన కట్నా న్ని వ్యతిరేకించడానికి వారు ముందుకు రావాలి.

వరకట్నాన్ని అంటిపెట్టుకొని మరికొన్ని సమస్యలు వున్నవి. "మా అబ్బాయిలకు కట్నం తీసికోము, మా అమ్మాయి లను కట్నం లేకుండా చేసుకునే వారున్నారా" అని తల్లిదండ్రులు అంటూవుంటారు. అవునుమరి! ఇది ఒక పెద్ద సమస్యే. తమ ఆడపిల్లలకు కట్నాలు ఇస్తున్నప్పుడు తమ మగ పిల్లలకు కట్నం తీసికుంటే తప్పేమిటి అంటారు వారు. అయితే ఈ సమస ఎందుకు వస్తుందంటే, అందరూ వరకట్నాన్ని ఒకేసారి నిరాకరించక పోవుటవలన. అందరూ వరకట్నాన్ని నిరాకరించేవరకు ఈ సమస్య తప్పదుమరి. అయితే, ఈ సమస్యకు భయపడితే, వరకట్నాన్ని నిర్మూలించలేము. కొద్ది కష్టాలు వచ్చినా కొంతమంది ముందుకు వచ్చి వరకట్న నిర్మూలనకు సహాయపడితే, మిగతావారు వారిని అను సరిస్తారు.

హెచ్చు కట్నాలేకాకుండా, ఘనంగా లాంఛనాలువుండాలంటారు. కొంతమంది మగపిల్లల తల్లిదండ్రులకు ఈలాంఛనాలన్ని కలుపుతే కట్నంలో సగకంటె పైగానే అవుతున్నది. అయితే ఈ లాంఛనా లన్నవి ప్రత్యేకమైన సమస్యకాదు. ఎందుకంటె వరకట్నం పోయిన నాడు ఈ లాంఛనాల సమస్యకూడా పోతుంది. కట్నమే వద్దన్న వ్యక్తి లాంచనాల విషయంలో పట్టుపట్టడు గదా!

పెళ్ళికి కొంత ఖర్చు అవుతుంది. అందువలన కట్నం కావాలి అని కొందరి వాదన. పెళ్లికి సంబంధించిన ఖర్చులు వరు నికి సంబంధించినంత వరకు 5000 రూపాయల వరకు వుంటాయి. ఈ ఖర్చు దృష్ట్యా కట్నం అవసరమని కొందరి భావన. అయితే, ఆడపిల్లల తల్లిదండ్రులు ఇంతకంటే ఎక్కువ ఖర్చు పెడుతున్నా

రని మరువకూడదు. ఈ సమస్యకు ఒకటే ఒక పరిష్కారం వుంది. ఈపెళ్ళికి సంబంధించిన ఖర్చులన్ని తీసివేస్తేపోతుంది.

వరకట్నాన్ని పూర్తిగా నిర్మూలించినా, కొన్ని సమస్యలు తలయెత్తకమానవు. మానవుడు స్వార్థపరుడు గదా. అందంగా లేని అమ్మాయిలకు ఈ రోజుల్లో కాస్త ఎక్కువ కట్నం ఇచ్చి పెళ్ళి చేస్తున్నారు. ఇక వరకట్నం పూర్తిగా తీసేస్తే, అంతా అందమైన అమ్మాయిలే కావాలంటారు ! అందంగా లేని అమ్మాయి గతేమిటి ? తాను మన్మధుడు కానప్పుడు తనకు రంభ కావాలనటం సమంజసము కాదు. ఈడు జోడు చూసుకుంటే ఫర్వాలేదు గాని, ఏదో రంభో ఊర్వశో కావాలను కొనటం న్యాయం కాదు.

అంతే కాదు. వరకట్నం పోయిన నాడు వరుడు బాగా ఆస్తి వున్న మామల కోసం వేటాడ వచ్చును. అటువంటప్పుడు ఆస్తి లేని తల్లిదండ్రులకు తమ ఆడ పిల్ల పెళ్ళి సమస్య గానే వుంటుంది. "అమ్మాయి ఉద్యోగం చేస్తుంటే మావాడు కట్నం తీసుకోడు" అని కొంత మంది తల్లిదండ్రులు అంటూ వుంటారు. ఉద్యోగం చేసే అమ్మాయిలయితే వరకట్నం కంటే ఎక్కువ విలువన్న మాట! అమ్మాయి వ్యక్తిగత లక్షణాలను లెక్కచేయక మిగతా విషయాలన్ని లెక్కలోనికి తీసుకొనుటవలన ఈ సమస్యలన్నీ వస్తున్నాయి. వివాహానికి అర్థం లేకుండా పోయినది. కట్నం తీసుకొని హాయిగా సంసారం చేయటం లేదా అని అన వచ్చు. ఇతరులను కష్ట పెట్టి హాయి అనుభవించటం కూడా గొప్పేనా!

బహుశా, ప్రేమ వివాహములు, మతాంతర వివాహములు వరకట్నాన్ని పూర్తిగా నిర్మూలించ గలవు. వాటి విషయంలో వరుడు మిగతా విషయాలన్నీ వదిలేసి, వధువు వ్యక్తి గత లక్షణాలనే లెక్కలోనికి తీసుకొంటాడు. అయితే, కొన్ని ప్రేమ వివాహములు విడాకులకు దారి తీసినవి. మతాంతర వివాహములతో సమస్య ఏమంటే, పిల్లలు మతంలేని వారవుతారు. మతం లేని వారిని పెళ్ళి చేసుకొనుటకు మన ప్రస్తుత సాంఘిక వ్యవస్థలో ఎవరు ముందుకు వస్తారు ? సాంఘిక ప్రగతికి కులం ఈ విధంగా ఆటంకంగా వున్నది.

ఒక సాంఘిక విప్లవం ద్వారా విద్యావ్యాప్తి ద్వారా మాత్రమే వరకట్న సమస్యను నిదానంగా నిర్మూలించ గలము.

స్వచ్ఛంగా ఎంత విరాళం ఇచ్చినా అనుభవించటంలో తప్పులేదు. కాని నిర్బంధంగా కట్నం తీసు కొనటమంటే మానవత్వాన్ని మంట గల్పుట యగును. ఇక మన యువతరం ఈ సవాలును ఎలా ఎదుర్కొంటారో చూడాలి.

## ఎక్కడుంది లోపం?

వరకట్నాన్ని సమర్ధించే కొంతమంది చిత్ర విచిత్రమైన వాదనలను తీసుకొస్తున్నారు. మన సమాజంలో తల్లిదండ్రులను చూడవలసిన బాధ్యత కొడుకులపైనే వున్నదట. అందువలన కొడుకులకే ఆస్తి హక్కు వుండాలట. వారి ఆర్థిక స్తోమత పెరుగుటకు వరకట్నం తీసుకున్నా ఫరవాలేదట. తల్లిదండ్రులను కొడుకులే చూచుట న్యాయము. దానిలో కొడుకులు చేసిన త్యాగమేమిటో అర్థముకాదు. కూతుళ్లు ఉద్యోగాలు చేయుటలేదు. కొడుకులే చేస్తున్నారు. అందువలనే తల్లిదండ్రులను చూడవలసిన బాధ్యత కొడుకులపై వున్నది. ఉద్యోగం చేస్తున్న కుమార్తెలు తమ తల్లిదండ్రులకు కొద్దో గొప్పో ఆర్థిక సహాయం చేస్తున్నారు. తల్లిదండ్రులు కుమార్తె ఏనాడో ఒకనాడు ఇంకొక ఇంటికి వెళ్లవలసినదిగానే భావిస్తారు. ఆమెకు తల్లిదండ్రులతో సంబంధాలు రానురాను తగ్గుతాయి. కొడుకులే వృద్ధాప్యంలో తమని చూస్తారు. కూతుళ్లు చూడరు. చూడలేరు కాబట్టి తల్లిదండ్రులకు ఈ భావన వుండుట సహజము. అయితే, ఇందుకు ఆడపిల్లలను నిందించవలసిన అవసరం లేదు. ఎందుకంటే, వారు తమ భర్తల మీదే ఆధారపడుచున్నపుడు వారు తమ తల్లిదండ్రులకు చేసేదేమిటి? చేయలేదని ఏ తల్లిదండ్రులు బాధపడటం సమంజసం కాదు. ఆ కారణంగా ఆడపిల్లలకు ఆస్తి హక్కు లేకుండా చేయటం కూడ అన్యాయమే ఆడపిల్ల పెళ్ళయిన తరువాత కూడ తండ్రి ఆస్తిలో వాటా అడిగి అన్నదమ్ములకు ఆస్తి వాటా తగ్గించుట అన్యాయమని కొందరంటారు. ఇటువంటి వారు రెండు అన్యాయాలను సమర్థిస్తున్నారన్నమాట. ఒకటి వరకట్నం, రెండు ఆడపిల్లలకు ఆస్తి హక్కు లేకపోవుట. వరకట్నం వుండుట వలన ఆస్తి హక్కు వుండకూడదు అనేదానికంటె, వరకట్నం పోగొట్టి ఆస్తి హక్కు కల్పించుదాము అని ఎందుకనుకోగూడదు? వరకట్నమే రూపుమాపితే, మిగతా సమస్యలు వుండవు కదా!

---

**మనం సంప్రదాయాన్ని అంటి పెట్టుకున్నంత కాలం వరకట్నాన్ని నిర్మూలించలేము**

---

# ఖమ్మం జిల్లాలోని ఆదిమవాసుల స్థితిగతులు

ఖమ్మం జిల్లాలోని జన సంఖ్యలో మూడవ వంతు ఆదిమ వాసులున్నారంటే వారి ప్రాబల్యం, ప్రాధాన్యతలు జిల్లాలోని తక్కిన ప్రజా జీవనంతో యెంతగా పెనవేసుకున్నాయో తెలుస్తుంది. పరిణామ శీలమైన నేటి కాలంలో పాత కొత్తల మేలుకలయికగా వీరి జీవన విధానం వర్ధిల్లుతోంది. వీరి జీవన విశేషాలను, స్థితిగతులను కొద్దిగా పరిశీలిద్దాం.

ఖమ్మం జిల్లాలోని ఆదిమ వాసులని, కోయలని, లంబాడీలని, గోండులని మూడు విభాలుగా వర్గీకరించవచ్చు. భాషదృష్ట్యా చూస్తే గోండు భాష మాట్లాడే వారొక వైపు, గోండు భాష గ్రామీణ తెలుగు భాష కలిపి మాట్లాడే వారు వేరొక వైపుగా తేల్చు కొనవచ్చు. మొదటి వర్గం వారి నివాస స్థానం దండ కారణ్య ప్రాంతంగా భావింపబడుతున్న గోదావరీ తీర ప్రాంతం. ఇందు నివసించే వారు కోయలు. వీరు కేవలం గోండు భాషనే మాట్లాడే వారు, కొర్రరాజు వీరి దేవత. ప్రాచీన కాలం నుండి వుండిన నరబలి ఆచారం నేడు వీరిలో లుప్తమైందని చెప్పవచ్చు. అయితే ప్రత్యామ్నాయంగా జంతు బలులు వీరిలో విస్తారం. అతి బాల్య వివాహాలు నేడింకా వీరిలో నిలచి వుండటం గమనార్హం. ఉమ్మడి కుటుంబ వ్యవస్థ లేదు. వివాహానంతరం వధూవరులు వేరు కాపురాలు నిర్వహిస్తారు. ప్రాచీన కాలంలో వున్న బహు భార్యాత్వం నేడు వీరిలో నిషిద్ధం. మన నాగరికతా సమాజాన్ని మించిన పాతివ్రత్య ప్రాధాన్య మనస్తత్వం వీరిలో చాలా యెక్కువ. చిన్న వయసులో మరణిస్తే ఖననం, పెద్ద వయస్సు వారైతే దహనం వీరి ఆచారం. ఈ నాడు కోయలు తమకు లభ్యమయ్యే అటవీ సంపదతో చిన్న చిన్న వర్తక వ్యాపారాలను గావిస్తున్నారు. గిరిజనాభివృద్ధి కార్పొరేషను ద్వారా ప్రభుత్వం కూడా వీరి యితోధికాభివృద్ధి కాంక్షిస్తోంది. వీరిలో విజ్ఞాన గంధం కూడ క్రమంగా బాగా వ్యాపిస్తోందని చెప్పవచ్చు.

ఖమ్మం జిల్లాలో పాల్వంచ, బూర్గంపాడు పర్వతప్రాంతాల్లో కొండరెడ్లు నివసిస్తుంటారు. వీరికి నాట్య విద్య ప్రత్యేక లక్షణం. నదీ దేవత వీరి జీవితపు సర్వ రంగాలలో సమ్మేళన మొందినట్టిది. తత్పూజ నిమిత్తమే స్త్రీ పురుషులు కలిసి సమిష్టి నాట్యాలు చేస్తారు. వీరి ఆటలలో కోలాటం ముఖ్యమైనది. అతి రమణీయమైన ప్రకృతి దృశ్యాలలో పరవశించి సాగించే వీరి ప్రశాంత జీవితానికి ఇటీవలి నక్సలైట్ ఉద్యమం కొంత విఘాతం కలిగించినప్పటికీ తిరిగి మనస్థయిర్యం పుంజుకొని తమ్ము తామభివృద్ధి పరచుకోడానికి కృషి చేస్తున్నారు. వీరు గూడ గోండు భాషనే మాట్లాడతారు.

ఈ జిల్లాలో మరొక ప్రసిద్ధ వన్యవాసులు లంబాడీలు. వీరు తమ భాషను గ్రామీణ తెలుగు భాషతో మిళితం చేసుకొని వ్యవహరిస్తుంటారు. జన బాహుళ్యంలో వీరిదే యెక్కువ శాతం. అంతే కాదు, ఆధునిక నాగరికతా జీవిత ప్రభావం వీరి జీవితాలలో ప్రవేశించిన శాతం కూడ యెక్కువే. వీరి భాషకూడ కేవలం వాగ్రూపంలోనే వున్నట్టిది. దీని లిపిని గూర్చి గ్రంథస్థ నిర్మాణం జరిపించడానికి మన ప్రభుత్వం పూనుకోవడం ముదావహం. నగర ప్రజల జీవితాలతో వీరికి దైనందిన సంబంధాలున్నాయి. దూర ప్రాంతాలకు రాకపోకలు గూడ వీరిలో విస్తారం. వీరిలో కొందరు బాగా విద్యావంతులై నగరాల్లో మంచి హోదాలలో స్థిరపడ్డవారే. శుభ సందర్భాలలో శోకాలు తీయడం యింకా వీరిలో నిలచివున్న వింత ఆచారం. సంప్రదాయబద్ధమైన వేషభూషణాల మీద వీరికి ఆసక్తి హెచ్చు. వీరి ప్రత్యేకతను ఆ సందర్భంగా నిలుపుకొంటుంటారు. అన్ని పండుగలలో "హోలి" పండుగను వీరత్యంత వైభవంగా జరుపుకొంటారు. ఉత్తర హిందూస్థాన సంప్రదాయాలు, వ్యవహారాలు ఆంధ్రదేశంలో వున్నప్పటకీ వీరిలో యింకా నిలచివున్నవని చెప్పవచ్చు. "కష్టించి పని చేసే" స్వభావం వీరిలో ఆబాల గోపాలం ఆవరించి వుంది. ఆధునిక ప్రక్రియలతో గూడిన వ్యవసాయాన్ని కూడ వీరు ముందంజ వేస్తూ అవలంబిస్తున్నారు. అదే అభివృద్ధి పథంలోకి వీరి క్రమ పరిణామానికి సోపానం అవుతోంది.

ఖమ్మం జిల్లాలో ఆదిమ వాసులుండే ప్రాంతాలలో నేటికీ "కెయిరన్లు" ఎక్కువగా గోచరిస్తాయి. అంటే ప్రాచీన కాలపు సమాధులన్నమాట. గ్రామీణులు వీటిని రాకాసి గుళ్ళు అంటారు. వీటిపై కొన్ని సంకేతాలు మొహంజొదారో, ఈజిప్టుల నాగరికతా విశేష సంబంధులుగా చరిత్ర కారులు చెబుతారు. వీనిపై విశేష పరిశోధనలు గావిస్తే అలనాటి ప్రజల జీవనగతులు విశేషంగా అవగతమవుతాయి. అందుకు ఖమ్మం జిల్లా ఆదిమవాసుల ప్రాంతం చక్కని ఆలంబనం. చిత్త శుద్ధిగల పరిశోధకుల కార్యక్రమమే మిగిలివున్నది.

"సుచంద్ర"



కొత్త గవర్నరు శ్రీమతి శారదాముఖర్జీకి బేగంపేట విమానాశ్రయంలో స్వాగతం




దుస్తులు తయారు చేసేవారు, విక్రయించేవారి ఫెడరేషన్ కార్యవర్గాన్ని ఉద్దేశించి కార్మిక శాఖా మాత్యులు శ్రీ టి. అంజయ్య గాంధీజ్ఞాన మందిర్‌లో ప్రసంగిస్తున్న దృశ్యం. చేనేత శాఖా మంత్రి శ్రీ కె. వి. కేశవులు కూడా చిత్రంలో వున్నారు.

## నగరంలో వార్తా చిత్రాలు




"యాజమాన్యంలో కార్మికుల భాగస్వామ్యం" పై ఏప్రిల్ 22నుండి 24 వరకు జూబిలీ హాలులో జరిగిన సెమినారులో మాజీ గవర్నరు శ్రీ బి.జె. దివాన్ ఉపన్యసించారు.




1977 ఖరీఫ్ కాన్ఫరెన్సు ఏప్రిల్ 30, మే 1 తేదీల్లో జూబిలీ హాలులో జరిగింది. వ్యవసాయ శాఖమంత్రి శ్రీ జె. చొక్కారావు ప్రారంభించారు.



సికిందరాబాద్ రైల్వే స్టేషన్లో పాడి పరిశ్రమాభివృద్ధి సంస్థ వారి పార్లర్‌ను శ్రీ కె.ఎస్. రాజన్ ఏప్రిల్ 24న ప్రారంభించారు.



న్యూ ఎం.ఎల్.ఏ. వసతి గృహంలో ఏప్రిల్ 29న పి.డబ్ల్యు. డి. శాఖా మాత్యులు శ్రీ సి.హెచ్. వెంకటరావు సౌకర్యాల సంఘం సమావేశానికి అధ్యక్షత వహించారు.





ఆర్థిక శాఖ కార్యదర్శి బి.పి.ఆర్. విఠల్, ఐ.ఏ.ఎస్, జిల్లా ప్లానింగ్ కాన్ఫరెన్సుకు ప్రారంభోత్సవం చేశారు.

నాంపల్లి ప్రభుత్వ ఆసుపత్రిలో మే 1న డాక్టర్ బంకట్‌చంద్రగారు హజ్రత్ యూసఫ్ షరీఫ్ బాబా స్మారక వార్డుకు ప్రారంభోత్సవం చేశారు.

మే 2న డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య ఎకాడమీ తరఫున బహుముఖ పండితుడు, మాజీ సెషన్స్ జడ్జి శ్రీ గుండేరావు హర్కారేగారికి రూ. 1116 బహూకరించారు.



# విదేశాల మీద మోజు

—శ్రీమతి ఖాసా సుశీల

"విదేశాలకు వెళ్లే భారతీయుల సంఖ్యను క్షుణ్ణంగా జాబితాలు వేసే రిజర్వు బ్యాంకు బులెటిన్‌లో ఇలా ప్రకటించింది: 1974–75 లో 20,504 మంది భారతీయులు ఉద్యోగనిమిత్తం విదేశాలకు వెళ్ళారు. ఈ సంఖ్య అంతకు క్రితం వెళ్లిన వారికి మూడింతలు. ఈ విపరీతమైన పెరుగుదలకు కారణమేమిటోగానీ, ఇది ఇలా ఎక్కువ కాలం కొనసాగితే ఎన్నో సమస్యలకు దారితీస్తుంది అని పేర్కొన్నది ఆ ప్రకటన. మా స్నేహితులు ఒకరింటికి వెళ్ళాను. వారుండే ప్రాంతంలో ప్రతి ఇంటి నుంచి కనీసం ఒకరన్నా పరదేశంలో ఉన్నారు, అన్నది ఆవిడ ! విదేశాల మీద ఈ విపరీతమైన మోజు ఎందుకు ? దేనికోసం ?"

ఇక్కడ దొరకనిదేదో అక్కడ దొరుకుతుందనీ, మేథకు తగ్గ మెప్పు, శ్రమకు తగ్గ ప్రతిఫలం లభిస్తుందని ఎందరో విద్యార్థులు వెడతారు. కేవలం ఉద్యోగ నిమిత్తంగానే కాక విజ్ఞాన సముపార్జన కోసం కూడా వెళ్ళే వారు చాలా మంది ఉన్నారు.

పరిశోధనాత్మక చదువులకు అక్కడ అవకాశాలు అధికంగా ఉన్నాయి. అర్హతకు గుర్తింపు దొరుకుతుంది అన్న గురి చాలా మంది విద్యార్థులలో ప్రబలంగా ఉంది. జీవితపు తొలి దశలోనే, ఓ ఆర్థిక స్థాయిని అందుకుని సరదాగా కొంత కాలం గడిపి నాలుగు డబ్బులు వెనుక వేసుకొని స్వదేశం చేరుకుందాం అనే ఉద్దేశంతోనూ వెళ్ళే వారున్నారు. వాణిజ్యరీత్యా తమ కొచ్చే లాభంలో కొంతా వాటాను విదేశ బ్యాంకులో ఉంచి అడపా దడపా విలాసంగా కాలం గడిపి వస్తూంటారు కొంత మంది.

ఈ విదేశాల మోజు నేటిది మాత్రమేకాదు, అనాది నుంచీ ఇది అందరికీ, ప్రతీ దేశవాసులకూ ఉంది. కొలంబస్ అమెరికాను ఎందుకోసం కనుక్కొన్నాడు ? ఉదర పోషణార్థం అన్న సూక్తి ప్రాముఖ్యత ఓ వైపు ఉండగా కేవలం ఉదర నిమిత్తమే మరో ప్రాంతానికి వెళ్ళరు మనుష్యులు. కొత్త ప్రదేశాలు చూద్దాం, కొత్త సంగతులను తెలుసుకుందాం. జీవితపు స్థాయిని పెంచుకుందాం, ఉన్న దానికి మరింత కలుపుకుందాం అనే ప్రకృతి సహజమైన జిజ్ఞాస మనుష్యులను మరో ప్రదేశాలకూ మంచి ప్రదేశాలకు మరలిస్తుంది. ఈ ఉద్దేశంతోనే చక్రవర్తులు సామ్రాజ్యాలు ఏర్పర్చుకున్నారు. దూరదేశాలకు వలస పోయారు. ఫాహియాన్ హూయన్‌సాంగ్, మార్కోపోలో లాంటి యాత్రికులు జ్ఞాన సముపార్జన కోసం బయలుదేరారు. దక్షిణ దేశపు రాజులు ప్రాచ్యతీరాలలో రాజ్యాలు ఏర్పరచుకొని హిందూ సంస్కృతిని స్థాపించారు. వారు నిర్మించిన బ్రహ్మాండమైన హిందూ ఆలయాలు, నేటికీ వారి కీర్తి చిహ్నాలుగా నిలిచి ఉన్నాయి. మత ప్రచారం కోసం బయలుదేరిన వారు ఉన్నారు. అశోక చక్రవర్తి బౌద్ధమత ప్రచారం కోసం ఎందరినో దూరదేశాలకు పంపించాడు. ఇక వాణిజ్యంకోసం బయలుదేరిన ఆంగ్లేయులు తదితర పాశ్చాత్య దేశస్థులు వర్తకం సాగించడమేకాక సామ్రాజ్యాలు స్థాపించుకున్నారు. మత ప్రచారం సాగించారు. కాని రోజులు మారాయి. సామ్రాజ్యాలు స్థాపించే రోజులు సమసి పోయాయి. మత వొత్తిడి నేడు నాగరికతా లక్షణం కాదు.

జనాభా సమస్యలు విదేశ నివాసానికి ఎన్నో కట్టుబాట్లను కలిగించాయి. అయినా రాకపోకలు హెచ్చుగానే ఉన్నాయి. విదేశాలకు వెళ్ళటానికి ముఖ్యంగా మూడు కారణాలు ఉన్నాయి. ఒకటి పై చదువుల కోసం, రెండు ఇక్కడ లభించని ఆర్థిక స్తోమతను అందుకోటానికి. అసంతృప్తి నివృత్తి చేసుకోటానికి జన్మభూమిని వదలి దూర తీరాలకు పోతారు కొందరు. ఇక్కడ నాకు తెలిసిన ఓ విషయం చెబుతాను. అమెరికాలో భారతీయ వైద్యుల సంఖ్య పెరిగి పోతూందనీ, తమ వారికి అపకారం జరగరాదనీ భారత వైద్యులకు ఉద్యోగ అవకాశాలు పూర్తిగా మూసివేయాలనే వుద్దేశంతో ఓ తుది గడువు తేది (జనవరి 9 కాబోలు నాకు పూర్తిగా గుర్తులేదు) నిర్ణయించింది, మాకు బాగా తెలిసిన ఓ అబ్బాయి స్కాలర్‌షిప్‌తో డాక్టరు చదువు పూర్తిచేశాడు. కానీ ఉద్యోగం దొరకలేదు. తాను ఇష్టపడి చేసుకున్న పెళ్ళికి అనుమతి లేక పోగా తల్లితండ్రులకు దూరమయ్యాడు. ఇద్దరూ ఎలాగో తంటాలు పడి క్లినిక్ పెడితే కలిసిరాలేదు. ఇక ఒకటే మార్గం. అమెరికాకు వెళ్ళాలి అనిఅనుకున్నాడు. సింగపూర్‌కు వెళ్ళి పరీక్షరాసి అమెరికా వెళ్ళటానికి అర్హత సంపాదించుకున్నాడు. తీరా వెడదామనుకుంటే గడువు తేదీ సమీపిస్తూంది. ఎలాగైతేనేమి వీసా సమయానికి వచ్చింది. చేతిలో డబ్బులేదు. ఆఖరి వరకు అన్నీ ఆటంకాలే. ఎలాగైతేనేమి ఆప్తమిత్రుడు రుణం యిచ్చి అవసరానికి ఆదుకున్నాడు. రేపు ప్రయాణమనగా సూటు నుంచి సూటుకేసు వరకు అన్నిఅమరాయి. రెండు నెలలు ఆశ్రయమివ్వగలను అని స్నేహితుడు రాసిన ఒక్క ఉత్తరం

బలంతోనే ధైర్యే సాహసే లక్ష్మి అన్నట్లు తన అదృష్టాన్ని వెతుక్కుంటూ విమానం ఎక్కాడు. ఇక ప్రభుత్వ ఉద్యోగులుగా, విలాసయాత్రికులుగా వెళ్ళేవారు కొంతమంది మాత్రమున్నారు.

తింటే అరిగిపోతుంది ఖర్చుపెడితే డబ్బు కరిగిపోతుంది. కానీ విద్య ఒక్కటే పంచుకున్న కొద్దీ పెరుగుతుంది. ఇచ్చిపుచ్చుకుంటే ఇనుమడిస్తుంది. ఉన్నచోటే వుంటే కూపస్థ మండూకం అని అంటారు కదూ? కాబట్టి కొత్త అనుభవాలు కొత్త ప్రదేశాలు, కొత్త మనుషులు, కొత్త సంస్కృతి పరస్పర పరిజ్ఞానానికి ఎంతైనా సహకరిస్తుంది కానీ అలాగని కేవలం విదేశ విద్యా సంస్థలలో చదువుకుంటేనే ఉన్నతజ్ఞానం పొందగలము అని చెప్పలేము. విదేశాలకు వెళ్ళడం ఓ ఫ్యాషన్ గా, ఓ కీర్తిగా, ఓప్రతిష్టగా. ఓ ప్రత్యేకతగా ఈ రోజులలో చాలా మంది అనుకుంటారు. ఈ భావాన్ని ఖండించే వారు వీరి దృష్టిలో అందని ద్రాక్షపళ్ళకు అర్రులు చాచిన వారవుతారు. ఇందుకు పూర్తిగా విరుద్ధంగా విదేశాలకు వెళ్ళటమే పూర్తిగా "నిషేధం" అన్న రోజులు లేక పోలేదు. సముద్రయానం చేస్తే (విమానాలు విరివిగాలేనప్పుడు) వెలివేసేవారు. ప్రాయశ్చిత్తం చేసుకోవలసి వచ్చేది. ఈ మన స్తత్వం మనదేశానికి ఎంత మాత్రం మేలు చేయలేదు, సుగంధాలను ఆస్వాదించలేక దుర్గంధాలను దూరం చేసుకోలేక అంతర్బాహ్య కవాటాలను బంధించుకుని నిజంగా కూపస్థ మండూకాలము అయ్యాము. అలాగని పొరుగింటి కూరే భుజిస్తాము అని అంటే ఇంటా బయటా కూడా హాస్యాస్పదులము అవుతాము, మనలో ఏమీలేదు, మనదేశం ఎందుకూ పనికిరాదు, పరదేశమే వైకుంఠం అనే వేలంవెర్రి మాత్రం పనికిరాదు. ఇక్కడే ముంది మా వాళ్ళు అక్కడే హాయిగా ఉంటారు అని ఎంతో బడాయిగా చెప్పుకుంటారు కొంతమంది. అక్కడే శాశ్వతంగా ఉండాలనుకుంటారు చాలామంది. కాపీ ఉండ నివ్వాలిగా! అందుకే తప్పని సరిగా తిరిగి వస్తారు ఎంతోమంది! వారి నుంచి మంచిని గ్రహించి మనకు, మనవారికీ, మన దేశానికి ఎలాసాయం చేకూర్చగలం అన్న దాంట్లో ఉన్న సరళత్వం ఎవరైనా హర్షిస్తారు.

---

# ఈ సంచికలో రచయితలు

## శ్రీయుతులు

" సుచంద్ర ", ఎస్. చంద్రశేఖర శాస్త్రి, ఎస్. ఎస్. ఆర్. జె. కళాశాల, ఖమ్మం-3

ఖాసా సుశీల, ఇంటి. నెం. 42, జర్నలిస్టు కాలనీ, నెం. 3, బంజారాహిల్స్, హైదరాబాద్.

పి. వి. సుబ్బారావు, టి. పి. ఆర్. ఓ, అడ్డతీగల, విశాఖ జిల్లా.

సిద్దాని నాగభూషణం, ఎ. పి. ఆర్. ఓ.. సమాచార, పౌర సంబంధ శాఖ, హైదరాబాద్.

టి. తాతిరెడ్డి, టి. పి. ఆర్. ఓ, సత్తెనపల్లి, గుంటూరు జిల్లా.

జె. ఎస్. రామకృష్ణ, నిడుమోలు, దివి తాలూకా, కృష్ణా జిల్లా-521 156

ఐ. సత్యసుందరం, 10/156, బలరామునిపేట, మచిలీపట్నం.

" మంజుశ్రీ " తెలుగు అకాడెమీ, హిమాయత్‌నగర్, హైదరాబాద్.

" గౌరీశంకర్ ", అంతర్జాతీయ తెలుగు సంస్థ, నారాయణగుడా, హైదరాబాద్.

" తిరునగరి " జిల్లాపరిషత్ ఉన్నత పాఠశాల, అడ్డగూడూరు, నల్గొండ జిల్లా

కప్పగంతుల లక్ష్మణశాస్త్రి, 69, ఆదర్శ నగర్, హైదరాబాద్.

శ్రీమతి సి. ఆనందారామం, ఎస్. టి. 26, మారేడుపల్లి, సికిందరాబాద్.

పులిచెర్ల సాంబశివరావు, 17వ లైను, అరండల్‌పేట, గుంటూరు-2

ఉన్నవ మదన మోహనరావు, ( 34354/2, హిందీనగర్ కాలనీ, బంజారాహిల్స్, హైదరాబాదు.

కామరాజుగడ్డ రామచంద్రరావు, పి. జె. 49, పంజాగుట్ట, హైదరాబాద్.

పింగళి పరశురామయ్య, జాండ్రపేట, చీరాల, ప్రకాశం జిల్లా.

సీరియల్ :




## -13-

అమ్మాయ్ ! లక్ష్మీ ! నేనా వరంగల్లు సంబంధం ఖాయం చేసికోవటానికి వెళ్ళుతున్నాను ! వేరే పిచ్చి పిచ్చి ఆలోచనలు పెట్టుకోక నేను చెప్పినట్టు విను !........అంటూ లక్ష్మి గదిలోకి తొంగి చూసిన చౌదరికి ఖాళీ మంచం వెక్కిరిస్తూ కనిపించింది.

చౌదరి గాభరాగా లోపలికి వెళ్ళాడు. ఎక్కడ సామాను అక్కడనే వున్నది. లక్ష్మి మాత్రం లేదు. ఒక వేళ పెరట్లోకి వెళ్ళిందేమోనని అనుకుంటుండగానే టేబిల్‌మీద పైకి కనపడేలా వుంచిన కవరు ఆకర్షించింది.

ఆత్రంగా కవరుమీద అడ్రసు చూశాడు చౌదరి. తన పేరే వుంది కవరుమీద. చౌదరిగుండె దడదడలాడింది. అమ్మాయి ఏదైనా అఘాయిత్యానికి తలపడిందేమోనని. అయినా తను లక్ష్మిని ఏమీ అనలేదే ! అని అనుకుంటూ గబగబ ఉత్తరం చదువుకో సాగాడు.

"ప్రియమైన నాన్నగారికి,

మీ కుమార్తె లక్ష్మి నమస్కరించి చేసికొను విన్నపము.

నాన్నా నాకు ఊహ తెలిసినప్పటినుంచీ నాన్నవు - అమ్మవుకూడా నీవే ! వేరే అమ్మ అంటే ఏమిటో నాకు తెలియదు. అయినా నాకు ఆ లోటు ఎన్నడూ అనిపించలేదు. నీ ప్రేమతో అమ్మను మరిచిపోయేలా చేశావు. నీవు నా కోరికలను ఎన్నడూ కాదనలేదనికూడా తెలుసు నాన్నా !

మీ దృష్టిలో నేనింకా పసిపిల్లనేకావచ్చు నాన్నా ! బహుశా ప్రతి తల్లీ - తండ్రీకూడా తమ సంతానంగురించి ఇలానే భావిస్తారు కాబోలు ! కాని నాకు ఇరవై ఏండ్లు వున్నాయని మీరు మరచిపోవద్దు ! నాకుకూడ అభిరుచులు - స్వంత అభిప్రాయాలూ, వ్యక్తిత్వమూ ఉన్నాయనే సంగతి మీకు కూడా తెలుసుననుకుంటాను

అందుచేతనే నేను నా అభిప్రాయాన్ని మీ ముందు వ్యక్త పరచగలిగాను. మీరు దేశానికి త్యాగంచేసినవారనీ, రాజకీయంగా పేరు ప్రతిష్టలు తెచ్చుకొని, నవసమాజ నిర్మాణానికి పాటుపడుతున్నారనీ, అందుచేత నా యీ అభిప్రాయం తమకు బాధ కలిగించదనే వుద్దేశంతో మీకు చెప్పాను. కాని మీ స్వచ్ఛమైన మనసుమీద ఏదో నలుపు రంగు పులుముకొన్నది. సాటివాళ్లను ఎదిరించి హరిజనుడిని పాలేరుగా పెట్టుకొన్న మీరు మీ కుమార్తె హరిజనుడిని ప్రేమించినదంటే విని సహించలేకపోయారు. మీరు ఎందుకిలా మారిపోయారో తెలియదు. మీ ఆలోచనలకు బూజు ఎందుకు పట్టిందో తెలియదు.

నా కోరికను మీరు సహించలేకపోయారు నాన్నా ! స్వార్థం లేకుండా పవిత్రభావంతో జైలుకు వెళ్లిన మీరు నేడు ఆస్తులకూ - అంతసులకూ అమ్ముడుపోయారు. నన్నో గొప్ప ఇంట్లో ఇవ్వాలని మీరు ప్రయత్నించారు నాన్నా ! మీకు నిజంగా నా సుఖమూ - నా సంతోషమూ ముఖ్యమైతే నన్నో పేదవాడికి ఇవ్వు నాన్నా ! నాకు అదే సుఖం - అదే సంతోషం.

ప్రకాశానికి ఏమి లోటు నాన్నా ! ఆస్తులు - అంతసుల కళ్ళ జోడు ఒకసారి తీసిచూడు నాన్నా ! మీరే అనేవారు కదా ప్రకాశం నిజంగా ప్రకాశమని. నన్ను రక్షించి ఇంటిలో వెలుగు నింపాడని ! తక్కువ కులంవాడు కావటమొక్కటేగా ప్రకాశంలోని దోషం. అది ఎవరి తప్పు నాన్నా ! ప్రకాశం తప్పా సమాజం తప్పా ! సమాజంలోని దోషానికి ప్రకాశాన్ని తప్పుబట్టవచ్చునా ?

నాన్నా! నా మీద వున్న మమకారంకొద్దీ, నన్నేమీ అన కుండా, లోపవగా వున్నాడని మీ క్రోధాన్ని ప్రకాశంమీద వెళ్ల గ్రక్కారు.

కాని ఒకటి మాత్రం నిజం నాన్నా! ఇందుతో ప్రకాశానికి ఏ మాత్రం సంబంధం లేదు. పాపం! అతనికి నేను ప్రేమిసున్న సంగతికూడా తెలియదు. నేను ఎప్పుడూ అతనితో ఈ విషయం ప్రస్తావించనుకూడ లేదు. ప్రకాశం ఎన్నడూ మర్యాదమీరి ప్రవ ర్తించనూ లేదు. నేనే అతన్ని తన అభిప్రాయం అడుగుదామను కొంటున్నాను. ఇంతలో మీతో చెప్పటం సంభవించింది. నా మూలాన నిరపరాధి అయిన ప్రకాశం అవమానం పాలయ్యాడు.

అందుకే ప్రాయశ్చిత్తం చేసికొందామని అనుకుంటున్నాను. నేను ప్రకాశం దగ్గరికే వెళ్లుతున్నాను. క్షమించమని వేడు కుంటాను. ప్రాణదాత ప్రకాశం తన పాదాలదగ్గర చోటు ఇస్తాడనే విశ్వాసంతో ఈ నిర్ణయం తీసికొన్నాను.

కానీ, ఒక్కటిమాత్రం గుర్తుంచుకో నాన్నా! మీ లక్ష్మి మీకు కళంకం తెచ్చే ఏ పనీ చేయదు! 'ఒక వేళ ప్రకాశం నిరాకరిస్తే' అంటారేమో! అది నా దురదృష్టంగా భావిస్తాను. అప్పుడు ఇంటికి తిరిగివచ్చి మీకు నలుగురిలో తలవంపులు కలిగేలా చేయను.

నా యీ నిర్ణయం మీకు బాధ కలిగిస్తుందని తెలుసు నాన్నా! కాని ఏం చేయను! మీరు ఎన్నడూ నన్ను కాదనలేదు; ఈ సారికూడ కాదనవద్దు నాన్నా! నన్ను క్షమించుతారు కదూ.

నా జీవిత భాగ స్వామిగా ప్రకాశాన్ని పొందగలిగేట్టు ఆశీర్వ దించు నాన్నా! తప్పక ఆశీర్వదిస్తారు కదూ.

మీ ఆశీర్వచనాన్ని అభిలషించే మీ కుమార్తె లక్ష్మి."

ఉత్తరం పూర్తి అయ్యేసరికి చౌదరి కళ్ల అశ్రువులు నిలి చాయి. అప్రతిభుడిలా శూన్యంలోకి చూస్తు వుండిపోయాడు? చేతిలోని వుత్తరం జారి నేలమీద పడింది. చౌదరి అది గమనించే స్థితిలో లేడు.

## 14

తెల్లవార వస్తుంది.

హరిజనవాడ ఎక్కడుున్నదో తెలుసుగాని లక్ష్మికి అందులో ప్రకాశం ఇల్లు ఏదో తెలియదు.

లోగడ ప్రకాశం తన ఇంటిని గురించి చాల వర్ణనచేశాడు. హరిజన వాడలో మేమే జమీందారులమని, మాదే పెద్ద ఇల్లనీ. కాని ఇప్పుడు చూస్తే లక్ష్మికి అన్ని ఇళ్లు ఒక్కలాగే కనిపిస్తున్నాయి. అన్ని పూరిగుడిసెలే.

"హరిజనవాడ మొత్తంమీద మా ఇంటిముందరే నీళ్లచల్లి ముగ్గు వేసేది" అని కూడ ఒకసారి ప్రకాశం అన్నట్టు గుర్తు.

ప్రకాశం ఇంటిదగ్గర వున్నాడో లేదో; నన్ను చూసి అస హ్యించు కుంటాడేమో; క్షమిస్తాడో, లేదో, భయంతో లక్ష్మిగుండె దడదడలాడుతున్నది. అడుగులు తడబడ సాగాయి.

ప్రకాశం ఇల్లు త్వరగా తెలుసుకుంటే బాగుండును అను కుంటున్న లక్ష్మికి రత్తి కనిపించింది. లక్ష్మికి రత్తి తెలియదు కాని రత్తి మాత్రం, కూలితోపాటు తవ్వెడి బియ్యం ఎక్కువ కొలిపించిన సిన్నమ్మగారిని జన్మలో మర్చిపోలేదు.

లక్ష్మిని చూడగానే రత్తికి ఆశ్చర్యం వేసింది. 'ఏంది! సిన్నమ్మగోరూ! ఇట్టావొచ్చేరేంది!' అని అడిగింది.

'ఇదిగో అమ్మా! నాకు ప్రకాశం ఇల్లు చూపిస్తావా?' అడిగింది లక్ష్మి.

'మీ పాలేరు ఇల్లే గదమ్మాగోరూ! ఇదిగో. ఇదే!' అంటూ చేతితో చూపిస్తూ 'ఏయ్ మావా! ప్రకాశం మావోయ్! సిన్నమ్మ గోరొచ్చారు; సిన్నమ్మగోరొచ్చారు....!!' అని అరుచుకుంటూ పరి గెత్తింది ప్రకాశం ఇంటివైపు. లక్ష్మి, రత్తి వెళ్లిన మార్గాన్నే అనుస రించింది.

గడపముందు తెల్లవారగానే సాక్షాత్తూ లక్ష్మీదేవిలా నుంచున్న లక్ష్మిని చూసి అంతావిస్తు పోయారు; 'చిన్నమ్మగారు వచ్చారు; ఏమ యింది తల్లీ! బాబుగారు కులాసయేనా!' ప్రశ్నల వర్షం కురిపించాడు రామదాసు.

ప్రకాశం ఆశ్చర్యంలోంచి తేరుకోనేలేదు. ఈలోగా హరిజన వాడ యావత్తూ ప్రకాశం ఇంటిముందర మూగింది. ఎవరినోట విన్నా చిన్నమ్మగారు వచ్చారు; చిన్నమ్మగారు వచ్చారనే.

చిన్నమ్మగారు ఎందుకు వచ్చిందీ ఎవరికీ తెలియదు; అందరూ గోలగా మూగారు ఇంటిచుట్టూ.

లక్ష్మి రెండు నిమిషాలు మౌనంగా నిలబడింది. ఆ తరువాత ప్రకాశం పాదాలను తాకి 'నన్ను క్షమించవూ!' అంటూ ఏడ్చింది.

ఈలోగా రామదాసు ఇంటిముందు మూగిన జనాన్ని కోప్పడి వెళ్లగొట్టాడు.

రామదాసుకు విషయమేమిటో అసలు అర్థం కాలేదు. పాదాలు తాకిన లక్ష్మిని ప్రకాశం రెండు చేతులతోనూ లేవదీశాడు.

లక్ష్మి ఏడుస్తూనే అన్నది 'నా మూలంగా నీవు అవమానం పాలు అయ్యావు కదూ.'

'ఇందులో అవమానం ఏమున్నది లక్ష్మి? పెద్దవాళ్లు పిల్లలు తప్పుచేస్తే దండిస్తారు. దానిలో అవమానం ప్రశ్న ఏముంది?'

'తప్పుచేయకపోయినా దండిస్తే అది అవమానించినట్టు కాదా?'

ఈసారి ప్రకాశం మౌనం వహించాడు.

లక్ష్మి జరిగిన సంగతిని యావత్తూ వివరించింది. ప్రకాశానికి చివరికి తన నిశ్చయాన్ని గూడ వెల్లడించింది.

ప్రకాశం చెప్పినదంతా విని కొద్దిక్షణాలు మౌనంగా వుండి పోయాడు.

'నీవు చాల తొందర పడావేమో లక్ష్మీ! మీ నాన్నగారి అభిప్రాయమే సరియైనదేమో!' అన్నాడు ప్రకాశం.

'నా సంగతి నేను నిస్సంకోచంగా చెప్పాను ప్రకాశం. మరి నీ అభిప్రాయమేమిటో తేల్చి చెప్పు' సూటిగా అడిగింది లక్ష్మి.

ప్రకాశం వెంటనే జవాబివ్వలేదు.

'పోనీ నీకు ఇష్టంలేకపోతే మానేయ్.'

'నాకు ఇష్టంలేదని కాదు!'

మరి భయపడుతున్నావా?'

'అవును లక్ష్మీ! నీ గురించే భయపడుతున్నాను! ఇప్పుడు నేను నిన్ను కాదన్నా, అవునన్నా కొన్ని ఇబ్బందులు ఎటూ తప్పవు! ఆ కష్టాలు నీవు భరించలేవేమోనని నా అనుమానం'.

'నీ వెంటవుంటే ఎట్టి కష్టాలయినా భరిస్తాను ప్రకాశం. నీవే ఒకసారి అన్నావు వర్ణాంతర వివాహం చేసుకొన్న దంపతు లిరువురికీ ఆత్మబలం అవసరమని, ఆ ఆత్మబలం నాకు వున్నది. నీ నీడలో నడవటానికి నేను ఎల్లప్పుడూ సిద్ధమే ప్రకాశం' అన్నది లక్ష్మి దృఢంగా.

'కాని ఒకటి! నాన్నగారు మనల్ని ఆశీర్వదించే వరకు మనం వివాహం మాట తలపెట్టవద్దు లక్ష్మీ! ఆయన ఆశీర్వాదం పొందితేనే నాకు తృప్తి!' అన్నాడు ప్రకాశం.

'నీయిష్టమే నాయిష్టం! ఈ రోజునుంచీ నీ అడుగు జాడల్లో నడుస్తానని ప్రమాణం చేసి చెప్పుతున్నాను' అన్నది లక్ష్మి.

* * * * *

'ఈ రోజునుంచీ లక్ష్మి మన ఇంట్లోనే వుంటుంది అమ్మా!' అన్నాడు ప్రకాశం.

'ఎవరు చిన్నమ్మగారా!' అన్నది వెంకాయమ్మ.

'ఈవేళ నుంచి నేనుచిన్నమ్మగారిని కాదు. లక్ష్మిని. మీకోడలిని. నన్ను ఆశీర్వదించండి అత్తగారూ!' అంటూ లక్ష్మి వంగి వెంకాయమ్మ పాదాలు తాకింది.

రామదాసుకు ఇదంతా కలయా వైష్ణవ మాయా అన్నట్లుగా వుంది.



## 15

ఇల్లంతా కలయ చూసింది లక్ష్మి. చాలా చిన్న ఇల్లు రామదాసుది. ముందు చిన్నవసారా! మధ్య రెండు దూలాల మీద ఆధారపడిన హాలు. వెనుక మళ్లీ వసారా! మధ్య హాలులోనే ఒక మూలగా ధాన్యంతో నింపినగాది వున్నది. తాటియాకు కప్పు. పెరట్లో ఆడవాళ్లస్నానం చేయటానికి బాత్ రూమ్ లాంటిది పిట్టగోడవుంది. దానికి తలుపులులేవు.

దగ్గరవుండి ఇల్లంతా చూపించాడు ప్రకాశం. స్నానాల గదికి 'తలుపులు లేవా'? అన్నది లక్ష్మి.

'ఇంకానయం! స్నానాలగది అంటూ ఒకటి వున్నది. హరిజనవాడలో ఏఇంటికీ స్నానాలగదులులేవు. ఒక్క మాయింటికే వున్నది' అన్నాడు ప్రకాశం.

'మరి మిగిలిన వాళ్లు స్నానం ఎలా చేస్తారు?' అమాయకంగా ప్రశ్నించింది లక్ష్మి.

'అసలు మా హరిజన వాడలోస్త్రీలు గాని, పురుషులుగాని స్నానం చేయరు. ఎండా కాలమయితే రెండు మూడు రోజుల కొకసారి చేస్తారు'

'అప్పుడైనా స్త్రీలు ఎక్కడ చేస్తారు?' అడిగింది లక్ష్మి.

'ఎక్కడంటే ఏంచెప్పేది? ఎవరి ఇళ్లదగ్గర వాళ్లు చేస్తారు. స్త్రీలు సాధారణంగా రాత్రి చీకట్లో చేస్తారు. అదీ రాత్రి వంటచేసికొన్న రోజున చేస్తారు. అందరికీ రాత్రి వంట చేసికొనే అదృష్టం వుండదు లక్ష్మీ! ఎప్పుడైనా బాగా కూలిదొరికితే రాత్రికి వండుకుంటారు. అప్పుడుపొంతలో నీళ్లుపోసికొంటారు' అన్నాడుప్రకాశం.

'మరి రోజూ స్నానం చేయకపోతే అనారోగ్యంగా వుండరూ?'

'ఎందుకు వుండరూ? వుంటారు! స్త్రీలు-పురుషులు తరచు అనారోగ్యానికి గురి అవుతూవుంటారు. దరిద్రం, అజ్ఞానం, తాగుడు ఇవే వారిని పీడిసున్న సమస్యలు.

తలకు నూనె రాసుకోరు! నూనెకొని రాసుకొనే శక్తి వాళ్లకులేదు! సబ్బుతో స్నానం ఒక్క మాయింటిలోనే! అందుకనే చెప్పానుగా మేము హరిజనవాడలో జమీందారుల వంటి వాళ్లమని. అయిదెకరాల వ్యవసాయం, గేదెపాడి వున్నది మాకు. వాళ్లకు అవీ లేవు!' అన్నాడు ప్రకాశం బాధతో.

'పోనీ, దరిద్రం అంటే సరి! పరిసరాలన్నా శుభ్రంగా వుంచుకోరేం?'

'చెప్పానుగా, అజ్ఞానం కూడా, దరిద్రం లాంటిదని. నా చిన్నతనంలో అదేదో స్కూలునుంచి పిల్లలు టీచర్లు వారం వారం వచ్చేవారు. హరిజనవాడ శుభ్రం చేయటానికని. ఇంకేం మావాళ్లు మరీసోమరులైపోయారు! ఎటూ వాళ్లు వస్తారుగా శుభ్రం చేయటానికి! అందు

కని రెండు మూడు రోజుల కొక సారి శుభ్రం చేసికొనే వారు కూడ అసలు మానివేశారు! ఒకసారి ఏమయిందో తెలుసా? ఒకవారం ఆస్కూలు వాళ్లు రాలేదు! ఆ మరుచటివారం వచ్చినప్పుడు వాళ్లను నిలదీసి అడిగారు క్రిందటి వారం ఎందుకురాలేదని?'

లక్ష్మికి నవ్వువచ్చింది.

'ఎందు చేతనంటావు వాళ్లు ఇలా అడిగింది? అజ్ఞానం వల్ల కాదూ!'

'అందుకనే ఎవరి శుభ్రత వాళ్లు తెలుసుకొనేలా చేయాలి! అప్పుడే హరిజనవాడగాని మరొకటిగాని బాగుపడుతుంది! '

'హరిజనవాడలోకి రాగానే ఒకవిధమైన వాసనగా వుంది. నీకూ అనిపించటం లేదా' అని అడిగింది లక్ష్మి. లక్ష్మికి హరిజన వాడలో నివాసం ఒక కొత్త అనుభవం.

'నాకు అనిపించదు! నీవు కొత్తగా వచ్చావు కాబట్టి నీకు వాసనగావుంటుంది. మాముక్కులు ఈ వాసనకు అలవాటుపడి పోయాయి.'

'పోనీ నీవైనా వాళ్లకు చెప్పలేదా?'

'చెప్పాను గదా? ఇది ఒకరు చెప్పితే వచ్చేదికాదని. వాళ్లంతట వాళ్లకు శుభ్రంగా వుండాలనే భావం కలగాలి! మనం శుభ్రంచేస్తే వాళ్లు అసలే వూరుకుంటారు!'

'నిజంగా ఎంతటి నికృష్టజీవితం గడుపుతున్నారో వీళ్లు' అనుకున్నది లక్ష్మి మనసులో.

* * * *

చీకటిపడింది. హరిజనవాడలో చాలమంది దీపాలు వెలిగించు కోలేదు! కొద్దిమంది ఇళ్లలోనే దీపాలు వెలిగాయి! దీపం అంటే లాంతర్లు కాదు! బెడ్ లైట్స్.

లాంతర్లు వున్న ఇల్లు మాదే'నని గర్వంగా చెప్పాడు ప్రకాశం.

మిగిలిన ఇళ్లలో బుడ్డి దీపాలు-చిమ్నీ లేకుండానే వుంటాయి. హరిజనవాడకు కరంటు దీపాలు వున్నాయి గాని, అవి ఎక్కడో దూరంగా చెరువు గట్టుమీద వున్నాయి! వాటి కాంతి గుడిసెలదాకా రానేరాదు!

ఇంతలో ఏదో గోల వినిపించింది. ఎవరో పోట్లాడు కుంటున్నారు. జనం అంతా సుబ్బి ఇంటి దగ్గర గుమిగూడారు. సుబ్బి-రత్తి పోట్లాడుకున్నారు! జుట్లు పట్టుకున్నారు! అశ్లీల పదాలతో ఒకరినొకరు తిట్టుకోసాగారు! కొంతమంది విడిపించ టానికి ప్రయత్నం చేస్తున్నారు. కొంతమంది వినోదం తిలకిస్తు న్నారు. కొంతమంది సుబ్బిని సమర్థిస్తే మరి కొంతమంది రత్తికి వత్తాసు పలుకుతున్నారు. పెద్దగా అరుపులు-కేకలు-గందర గోళంగా వున్నది.

ప్రకాశానికి ఆ గోల కొత్తేం కాదు. రోజూ ఎవరో ఒకరు పోట్లాడుకుంటూనే వుంటారు! అందుకని మెదలకుండా వూరు కున్నాడు.

లక్ష్మికి అది కొత్త అనుభూతి.

'ఎవరో పోటాడుకుంటున్నారట్లుంది' అన్నది ప్రకాశంవైపు చూస్తూ.

'మా వాడల రాజూ పోట్లాడుకుంటారు. అది నిత్యం జరిగేపనే.' బదులు చెప్పాడు ప్రకాశం.

'ఏమిటో కారణం తెలిసికోరాదా?' అన్నది లక్ష్మి. ప్రకాశం బయటికి వచ్చి కారణం తెలిసికొని వెళ్లి లక్ష్మితో చెప్పాడు.

'రత్తి ఎప్పుడో వారం రోజుల క్రిందట సుబ్బికి పావలా బదులిచ్చిందట! ఇప్పుడు అడిగితే నేను నీకు అప్పుడే ఇచ్చేశాను! మళ్లీ అడుగుతావా' అని సుబ్బి పోట్లాడుతున్నది.

'పావలా కోసం ఇంత సేపు పోట్లాడుకోవాలా?' అన్నది లక్ష్మి ఆశ్చర్యపోతూ.

'డబ్బులున్న వాళ్లకి పావలాయేగదా అనిపిస్తుంది. లేని వాళ్లకి అదే గొప్ప ' అన్నాడు ప్రకాశం.

'పోనీ పావలా నేను ఇస్తాను! వాళ్లను పోట్లాడుకోవద్దని చెప్పు'

'నీవు పావలా ఈ వేళ ఇస్తే రోజుకో తగాదా పుట్టు కొస్తుంది! అప్పుడు ఎంతమందికని ఇస్తావు?' అన్నాడు ప్రకాశం, అది పరిష్కార మార్గం కాదన్నట్టు తల అడ్డంగా తిప్పుతూ.

'నిజంగా సుబ్బి పావలా ఇచ్చే వుంటుందా?' అనుమానంగా అడిగింది లక్ష్మి.

'ఏమో! ఎలా చెప్పగలం? ఇచ్చాననేగదా దాని వాదన?'

పిల్లల ఏడుపులు-అశ్లీల పదాలతో అరుచు కోవటంతో వాతా వరణంలో ప్రశాంతత లేకుండా పోయింది.

ఒక గంట సేపటికిగాని తగాదా సమసి పోలేదు! తగాదా సమసిపోయిందనే దానికంటె వాయిదా పడిందనటం మంచిది.

లక్ష్మికి ఆ రాత్రి సరిగా నిద్ర పట్టలేదు. తండ్రి గుర్తుకు వచ్చాడు! ఏం చేస్తున్నాడో! ఏమనుకుంటున్నాడో!

ఆలోచనలతోనే తొలికోడి కూసింది! (సశేషం)

## వచన కవితా రూపకం



# కవితావేశం
# నా దేశం



—శ్రీ జె. ఎస్. రామకృష్ణ

(గత సంచిక తరువాయి)

### స్వాతంత్ర్యభానుడి ప్రవేశం

పాపం లక్షాధికారుల పాట్లు...
వీడి రూపాయలకు
రెక్కలొచ్చాయి.
పంజరం నుండి విడిపించుకొని
ప్రజల్లోకి వచ్చేశాయి.
వీడి నాడి దొరికింది.
కీడు మూడింది.
ప్రజలరక్తం పీల్చిపీల్చి
ఒక్కో అంతస్థు పై కెక్కుతున్నాడు
అక్కడ నుంచి పడితే
ఎక్కడుంటాడో పాపం....

శిఖరాలు తరుగుతున్నాయి
లోయలు పూడుతున్నాయి
మిట్ట పల్లాలు సమతలంగా
నిలుస్తున్నాయి.
ఎంత చక్కటి ·
శుభ పరిణామం
భారతా వనికే ఆభరణం
నిశి నిర్గమిస్తుంది
ఆశ ఉదయిస్తుంది
సహారాలో నయాగరా
నయాగరా....నగారా
కనండి కనులారా!
అనుభవించండి తనివితీరా

### స్వాతంత్ర్య భానుడి ఆత్మగతం

ఎవరు వీరు
నన్ననుసరిస్తున్నారు
ఎక్కడిదీ పదధ్వని
ఎవరీ సౌందర్య మోహిని
అడుగుజాడలా అనుసరిస్తుంది
వెలుగు నీడలా వెన్నంటివస్తుంది
అలనాటి భువన మోహినిలా
రాచహంస నడకలతో
రమణీయంగా వస్తుంది
సంప్రదాయ బద్ధయై
అభ్యుదయ స్నిగ్ధయై
ఎంతమనోహరంగా వుందీమె.
ఇంతకీ ఎవరీ భామ !
ఎవరో తెలుసు కొంటాను
కలుసు కొంటాను

ఏమండీ.........
ఎవరండీ మీరు

తీగతెగిన గాలిపటంలా
తిరిగే నావెంట వస్తున్నారు
వెన్నెల్లా వున్నారు
విరిసిన మల్లియలా వున్నారు.
ఎక్కడికి మీ పయనం
ఏమిటి మీ వైనం
నేను తెలుసు కోవచ్చా
మీ స్వేచ్ఛా జీవిత
విశేషాల నడుగవచ్చా
ఇంతకీ మీ చిరునామా !

ప్రగతి:- సుమతీ...

నా పేరు ప్రగతి
మమత నా మాత
శ్రామికత నా పిత
అందరిలాంటి దాన్నికాను
ఆవేశానికి లోనయ్యే దాన్నికాను
చైతన్యముంది నాలో
సౌజన్యముంది నాలో
సౌందర్యముంది నాలో
జీవితాన్ని పంచుకునే
భాగస్వామిని ఎంచుకొంటున్నాను
'వెల'తో ఓ పురుషుణ్ణి కొని
వేలు పట్టుకున్నంత మాత్రాన
జీవితం బానిసత్వంలో
మ్రగ్గటం సహించలేను.
అందుకే
అపురూప వరుణ్ణి వెదుక్కుంటున్నాను
అందుకే నచ్చారు మీరు
అందమైన వారు.

ఆత్మ విశ్వాసమున్నవారు.
ఇంతకీ ఏమంటారు మీరు
నన్ను మన్నిస్తారా.
నా నిర్ణయం హర్షిస్తారా
నా పయనాన్ని
మీ ప్రణయంలో
సంగమించ మంటారా !

స్వా. భా :—
ఏమండీ.... మీరు....
నా కన్నులు కారుగదా
నా గుండె
మీరు లా వున్నారు
నా హృదయం
అయోమయంగా వుంది
మీ ముందు
నా మనస్సు విచలిస్తుంది
మీ ధైర్యం మేరువు
మీ హృదయం సింధువు
మేరువును ఎదుర్కొనగలనా
సింధువును తరచగలనా.
అసమర్ధుణ్ణి నేను
అసహాయుణ్ణి నేను
ఏ నిర్ణయం తీసుకోలేను
అతి శీఘ్రంగా
ఆశలకు వ్యగ్రంగా....
దయయుంచి మన్నించండి
మా అమ్మగార్ని అడగాలి.

ప్రగతి :— ఏమండీ కట్నం కావాలా మీకు ?
కట్నం కన్నెల హృదిలో బాకు.
కట్నాలతో
కన్నెల జీవితాలను
రాట్నం వడకకండి
తెగేదాకా లాకకండి
అభ్యుదయ భావాలున్న మీరు
ఆలోచించి నిర్ణయం తీసుకోలేరా !
మీ జీవిత సమస్యను
మరొకరి ముందు సంప్రదిస్తారా?




స్వా :— ఆగండి.... మీరు
అపార్ధం చేసుకోకండి
దయ వుంచి.
మా అమ్మగారిని
అడుగుదా మనుకున్నానంతే
ఆమె కన్నెల నుండి
కట్నం కోరదు
కారుణ్యం
మాతృత్వం తప్ప
తెలియని ఆమె
అంతకు మించి
ఏం కోరుతుంది చెప్పండి
మా అమ్మగారి దగ్గరకు
వెళదాం రండి.
(భరత మాత దగ్గరకు వెళ్ళుదురు)

అమ్మా.........భరతమాతా
ఇదిగో ఎవరొచ్చారో చూడు
ఈమె ' ప్రగతి '
ఇపుడు ఈమె నా జగతి
నా భావాలకు
రూపమొస్తే
ఈమెలా వుంటుంది కదూ !
నా ఆశలకు ప్రాణమొస్తే
ఈమెలా వుంటుంది కదూ !
నీ ఆజ్ఞను శిరసావహించి
నలుదిశలు పయనించి
నానా దృశ్యాల్ తిలకించి
వస్తుంటే వరించింది ఈ సుందరి
వేసింది అనురాగపు పందిరి
ఈమే నా జీవిత మాధురి.

## భరత మాత

నాయనా కుమారా
నీ కర్తవ్యం వరించి
నీ గమ్యాన్ని స్వీకరించి
' భావి ' వైపు సాగుతున్నావు
నీ నిర్ణయం ఋజువైనది
నీ భవిష్యత్తు నిజమైనది
ఆనందానికి పేరై
అనురాగానికి మారై
జీవితాన్ని పంచుకోండి
అభ్యుదయాన్ని మనసులో వుంచుకోండి

## భరత వాక్యం

అదిగో ..............
అభ్యుదయ పథంలో యువత
వారి ననుగమిస్తుంది జనత
ముగ్గులు వేస్తుంది నవత
ముస్తాబవుతున్నది సమత
మూడు పువ్వులారు కాయలై
మైమరపిస్తుంది మానవత.

(సమాప్తం)

దీనులకు దివ్య నిలయం

# దివిసీమ గాంధీ క్షేత్రం

—శ్రీ సిద్ధాని నాగభూషణం

ప్రజలను విజ్ఞానవంతులుగా రూపొందించి సమాజ వికాస కార్యక్రమాలను అమలుజేసే విషయంలో ప్రజలను కార్యోన్ముఖులుగా రూపొందించి సంఘసేవా పరాయణులుగా తయారుచేసే పవిత్ర ఆశయంతో పుష్కరం క్రితం 1965 వ సంవత్సరంలో కృష్ణాజిల్లా అవనిగడ్డలో దివిసీమ వైజ్ఞానిక సాంఘిక సేవాసంస్థను ప్రస్తుత విద్యాశాఖ మంత్రి శ్రీ మండలి వెంకట కృష్ణారావుగారు స్థాపించారు.

ఈ సంస్థను స్థాపించిన నాటి నుంచీ జాతీయ నాయకుల జన్మదినోత్సవాలు నిర్వహించటం, పండుగ రోజుల్లో యువతీ యువకులకు ఆటల పోటీలు, నాటక, నాటిక పోటీలు, సంగీతం పోటీలు నిర్వహిస్తూ ఉండటం ఈ సంస్థ ప్రత్యేకత. ప్రతి యేడూ నిర్వహించే ఈ కార్యక్రమాల సంరంభం నిజంగా ఎంతో ఆనందోత్సాహాలను కలగజేస్తుంది.

ఈ దివిసీమ వైజ్ఞానిక, సాంఘిక సేవాసంస్థ అనుబంధంగా ఈ సంస్థ ఆధ్వర్యంలో 1965 నవంబరు 14వ తేదీన ప్రియతమ నాయకులు పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ జన్మదినోత్సవం సందర్భంగా బాలానంద సంఘాన్ని నెలకొల్పింది. ఈ సంస్థ స్థాపించిన తర్వాత ప్రజలలో ఈ సంస్థ ప్రయోజనం విషయంలో విస్తృత ప్రచారం ఇవ్వడంజరిగింది. ఈ సంస్థ స్థాపన విషయంలోనూ, కార్యక్రమాలు అమలుజరిపే విషయంలోనూ ప్రజలు అందజేసిన సహకారంవల్ల ఈ సంస్థను 1966వ సంవత్సరములో నమోదుచేయటం జరిగింది.

నమోదుచేసిన తర్వాత వయోజనులలో విజ్ఞాన జ్యోతిని వెలిగించే పవిత్ర ఆశయంతో ఈ దివిసీమ వైజ్ఞానిక సాంఘిక సేవా సంస్థ వయోజనులకు వయోజనవిద్యా తరగతులను నిర్వహించి అనేక మందికి అక్షరభిక్ష ప్రసాదించింది. తర్వాత ఈ సంస్థ ఆర్థిక ప్రయోజనం కలిగించే కార్యక్రమాలను అమలు పరిచే విషయంలో దృష్టిని మరల్చింది. కదురాడినా కవ్వమాడినా కరువు ఉండదన్న సత్యాన్ని గ్రహించిన ఈ సంస్థ ప్రోత్సాహంతో అవనిగడ సమితి ప్రాంతంలో అంబర్ చరఖా కేంద్రాలను నిర్వహించింది. హరిపురం, కోడూరు, జయపురం, మోదమూడి, చల్లపల్లి కేంద్రాలలో 3000 మందికి శిక్షణ ఇప్పించింది. దీనివల్ల మహిళలకు పాక్షిక ఉపాధి కల్పించినట్లు అయింది.

తెలుగుభాష అభివృద్ధి చేయటానికిగాను పండిత పరీక్షలకు విద్యార్థి, విద్యార్థినులను పంపించటానికిగాను శారదా విద్యా పీఠాన్ని 1966 వ సంవత్సరంలో ఈ సంస్థ ప్రారంభించి నిర్వహిస్తున్నది. హిందీ పండితుల శిక్షణకేంద్రం కూడా ఈ సంస్థ ఆధ్వర్యంలో నిర్వహించబడుతున్నది. ఇందులో ప్రతీ ఏడూ 46 మంది శిక్షణ పొందుతున్నారు.

ఈ సంస్థ కార్యకలాపాలు విస్తృతమయ్యాయి. విజ్ఞాన సమితి కార్యభారం పెరిగింది. అవనిగడ్డ సమితి గ్రామాల్లో పనిజేస్తున్న వివిధ సంస్థలకు సమన్వయసంస్థలు వెలిశాయి. ఈ సంస్థకు అనుబంధంగా అవి పనిజేస్తూ గ్రామాలలో పనిజేస్తున్న స్వచ్ఛంద సంస్థలకు చక్కని సలహాలు యిస్తున్నాయి. దివిసీమ స్థాయిలో ఉన్న మహిళా సేవాసంఘం, రైతు సేవాసంఘం, యువజన సంస్థ, బాలానంద సంఘం, జీవ కారుణ్య సంఘం, దీనజన రక్షణసంస్థ మొదలైన సంస్థలు దివిసీమ వైజ్ఞానిక, సాంఘిక సేవా సంస్థ సలహాలను మార్గదర్శక సూత్రాలపైననే నిర్వహించటం నిజంగా ఎంతో ప్రశంసనీయమైన విషయం.

1968వ సంవత్సరం వరకు ఈ దివిసీమ వైజ్ఞానిక సాంఘిక సేవా సంఘానికి కార్యక్షేత్రంగాని, కార్యకలాపాలు నిర్వహించటానికి శాశ్వత భవనం కాని లేదు. ఈ సంఘవ్యవస్థాపకులైన విద్యాశాఖమంత్రి శ్రీ మండలి వెంకట కృష్ణారావుగారు ఈ సంస్థ శాశ్వత భవనాలు ఏర్పాటు చేయటానికి విరాళాలు ఇవ్వవలసిందని విజ్ఞప్తి చేశారు. ఆ విజ్ఞప్తి మేరకు విరాళాలు వచ్చాయి. సుప్రసిద్ధ దేశభక్తులైన శ్రీ కోసూరి రత్తయ్యగారు గ్రంథాలయ భవన నిర్మాణానికి 20 వేల రూపాయలు విరాళం యిచ్చారు. భవనం నిర్మింపబడింది. తర్వాత శ్రీ గొట్టిపాటి బ్రహ్మయ్యగారి పేరిట భవనం పై అంతస్థు నిర్మించింది ఈ సంస్థ. ఒక భవనానికి ప్రస్తుత ఆర్థికశాఖ మంత్రి శ్రీ పిడతల రంగారెడ్డిగారు ప్రారంభోత్సవం చేశారు. ఈ భవనాలలోనే దివిసీమ వైజ్ఞానిక సాంఘిక సేవాసంఘ కార్యకలాపాలను నిర్వహిస్తున్నది. ఈ భవనాలు ఉన్న ప్రాంతానికి గాంధీజీ శతజయంతి ఉత్సవాలు సందర్భంగా 'గాంధీక్షేత్రం' అని పేరు పెట్టారు. ఈ గాంధీక్షేత్రంలో గాంధీజీ సిద్ధాంతాలను ప్రచారం చేయటానికిగాను ఒక గ్రంథాలయాన్ని నెలకొల్పి గాంధీజీ జీవితాన్ని, సిద్ధాంతాలను వివరించే పుస్తకాలను కొన్ని గ్రంథాలయంలో ఉంచారు. గాంధీజీ జీవితానికి సంబంధించిన చిత్ర పటాల శాశ్వత ప్రదర్శనను ఏర్పాటుచేశారు. ఇటీవలనే దివి సీమ వైజ్ఞానిక సాంఘిక సేవాసమితిలో ఒక భాగంగా ఇంకొక సంస్థను ఏర్పాటు చేశారు. ఆ సంస్థ ఆధ్వర్యంలోనే మూడు రోజులపాటు గాంధీజీ సిద్ధాంతాలపై ఎన్నిక చేసిన మద్రాసు, ఆంధ్ర ప్రదేశ్ విద్యార్థులకు శిక్షణ ఇవ్వటంజరిగింది. ప్రతి ఏడూ ఈ విధంగా శిక్షణ తరగతులు ఏర్పాటుచేసి గాంధీజీ సిద్ధాంతాలను అధ్యయనం చేయటం జరుగుతుంది.



శ్రీమతి తిరుమల శెట్టి సీతామహాలక్ష్మమ్మ మహిళా మండలి భవనానికి 1976 అక్టోబరు 2న విద్యామంత్రి సతీమణి శ్రీమతి ప్రభావతి కృష్ణారావు ప్రారంభోత్సవం చేశారు. చిత్రంలో పి.సి.సి. అధ్యక్షులు శ్రీ తాడేపల్లి మునలయ్య, విద్యామంత్రి శ్రీ ఎం. వి. కృష్ణారావు. భవనదాత శ్రీ టి. కుమారస్వామినాయుడు ఉన్నారు.



అవనిగడలో మహిళా మండలి భవనం.





అవనిగడ్డ గాంధీక్షేత్రంలో అనాథ శరణాలయం.



అనాథ శరణాలయ భవనానికి విద్యార్థినుల శ్రమదానం. ఇప్పుడు యిందలోని పిల్లలకు ఉచిత భోజన, వసతి సౌకర్యాలున్నాయి.

అందమైన ప్రకృతి మధ్య సుందరంగా విరాజిల్లుతున్న గాంధీ క్షేత్రంలో దివిసీమ వైజ్ఞానిక సాంఘిక సేవాసంస్థ పేదప్రజల సౌకర్యం కోసం ఉచిత వైద్యచికిత్సా కేంద్రాన్ని నెలకొల్పింది.

గాంధీజీ శతజయంతి నాటికి లక్షరూపాయలు ఆస్తులను కలిగిన దివిసీమలోని ఈ సంస్థ 5000 పుస్తకాలతో గ్రంథాలయాన్ని నిర్వహిస్తున్నది. ఈ గ్రంథాలయానికి పదివేల రూపాయల ఫర్నీచర్ ఉంది.

బాలల్లో విజ్ఞాన వికాసాలు కలగజేసే మహత్తర ఆదర్శంతో ప్రారంభించబడిన బాలానందసంఘం అధ్యక్షులు శ్రీ మండలి బుద్ధ ప్రసాద్ నాయకత్వంలో శరవేగంగా పురోగమిస్తున్నది. ఈ బాలానందసంఘం అప్పుడే రాష్ట్రస్థాయిలో ఏర్పాటుచేసిన నాటికల పోటీలో పాల్గొని బహుమతులు అందుకొనటం నిజంగా ఎంతగానో అభినందనీయం.

మహిళామండలి కార్యాలయానికి శాశ్వత భవనంలేని కొరతను తీర్చేందుకు భవనాన్ని నిర్మించాలని పూనుకొన్నప్పుడు భవన నిర్మాణానికి శ్రీ తిరుమలశెట్టి వెంకటస్వామిగారు తన భార్య శ్రీమతి సీతామహాలక్ష్మమ్మ పేరిట ఒక భవనాన్ని నిర్మింపజేసి విరాళంగా ఇచ్చారు. ఈ భవనానికి విద్యాశాఖ మంత్రి సతీమణి శ్రీమతి ప్రభావతి కృష్ణారావుగారు 1976 న సంవత్సరం గాంధీ జయంతి రోజున ప్రారంభోత్సవం చేశారు. ఈ మహిళామండలి భవనంలో కుట్టు తరగతులు నిర్వహించబడుతున్నాయి. ఇటీవల ఈ మహిళా మండలి ఆధ్వర్యాన సంక్షిప్త విద్యాపథకం ప్రారంభించబడింది. ఈ పథకం క్రింద పేద మహిళలకు, యువతులకు మెట్రిక్ పరీక్షలకు హాజరవడానికి శిక్షణ ఇస్తారు. వసతి భోజన సదుపాయాలు ఈ మహిళా మండలి సమకూర్చుతుంది. శ్రీ తిరుమలశెట్టి కుమారస్వామినాయుడు మూడో భవనాన్ని నిర్మించేశారు.

వ్యవస్థాపక అధ్యక్షులైన శ్రీ మండలి వెంకటకృష్ణారావు గారు విద్యామంత్రిగా ఎన్నికయ్యాక దివిసీమ వైజ్ఞానిక, సాంఘిక సేవాసమితి అధ్యక్షపదవికి రాజీనామా చేశారు. ప్రస్తుతం అధ్యక్షులుగా ఉన్న శ్రీ కోట కేశవపెరుమాళ్ళుగారు 1973 సంవత్సరంలో ప్రెసిడెంట్‌గా ఎన్నికయ్యారు.

దివిసీమ వైజ్ఞానిక, సాంఘిక సేవాసంస్థ ఈనాడు వివిధ తాలూకా స్థాయిసంస్థలకు సలహాసంస్థగా, కార్యక్రమాలను అమలు పరచే కార్యాచరణసంస్థగా విరాజిల్లుతూ సాంఘిక విప్లవ విజయానికి నిరంతరం కృషిచేస్తున్నది.

## నవ్వులు — పువ్వులు








# దూసరపాము సగ్గు బియ్యం ఫ్యాక్టరీ

—శ్రీ వి. వి. సుబ్బారావు

తూర్పు గోదావరి జిల్లా ఎల్లవరం తాలూకా రాజ ఒమ్మంగి పంచాయతీ సమితిలో దూసరపాము గ్రామం ఒక ఏజన్సీ గ్రామం. ఈ గ్రామమంతా వ్యవసాయము తప్ప వేరు జీవనాధారం లేదు. పూర్తిగా వర్షాధారమగుట వలన యితర ఋతువులందు యీ గ్రామస్థులకు పని లభించదు.

1977 మార్చి 11న యీ గ్రామానికి తలమానికంగా వెలసిన "శ్రీ విజయ పరమేశ్వరీ సగ్గు బియ్యము ఫ్యాక్టరీ"కి రాజ ఒమ్మంగి మండలాధికారి శ్రీ కె. ఎల్. నరశింహ స్వామి ప్రారంభోత్సవం చేశారు. ఈ ఫ్యాక్టరీ నిర్మాణమునకు యిద్దరు గిరిజనులు, మరి ఆరుగురు మధ్య తరగతి కుటుంబీకులు కృషి చేసి రూ. 1,25,000 లు పెట్టుబడి పెట్టి విజయం సాధించారు. ఆంధ్రప్రదేశ్ స్టేట్ ఫైనాన్సు కార్పొరేషను వారు రూ. 1,00,000 లు ధన సహాయం చేశారు. ఈ ఫ్యాక్టరీ నడుపుటకు కావలసిన పెట్టుబడిని అడ్డతీగల యూనియన్ బ్యాంకు ఆఫ్ ఇండియా వారు ఋణంగా సమకూర్చారు.

రోజుకు 45 టన్నుల దుంపను ఆడగలశక్తి గల యీ ఫ్యాక్టరీలో నాలుగు మాసాలు మొదలు ఆరుమాసాలు 300 మందికి జీవనభృతి కల్పించబడింది. వారందరికీ రోజుకు రూ 4–00లు మొదలు రూ 5–00లు వారి పనిని బట్టి ఆదాయం లభిస్తుంది. ఒక పది మందికి మాత్రం సంవత్సరాంతము పూర్తిగా పని దొరుకుతుంది. ఈ ఫ్యాక్టరీ స్థాపన వలన యీ ప్రాంతములో 300 ఎకరాల్లో దుంప తోటల పెంపకము జరిగి సుమారు 60 కుటుంబాలు కూడా లబ్ధి పొందుతాయి. "ఇది మాకు జీవనాధారమైన ఆలయం" అంటారు చూడవచ్చిన గిరిజన యువకులు, రైతులు ఆశాజనకమైన ముఖాలతో.

కష్టించి పనిచేస్తే కలిమి బలిమి వస్తాయి

సీరియల్:



# స్వర్ణయోగి

పులిచెర్ల సాంబశివరావు

—నవమ యోగము—

వాన వెలిసింది.

తెల్ల వారింది.

ఆ అరణ్యంలో వర్షం ఎంత కురిసినా బాధలేదు. అది ఎవరికీ నష్టదాయకం కాదు; ఒక్కరికి తప్ప!

అతడు విశ్వదాభిరామయ్య.

విశ్వదాభిరామయ్యది కొండవీడు. కంసాలి. బంగారు పనిలో ఆతని నైపుణ్యం జగత్ ప్రసిద్ధము. పెదకోమటి వేమారెడ్డి రాజ్యం చేస్తున్నపుడాయనకు కావలసిన ఆభరణాలన్నీ విశ్వదాభిరామయ్యే చేసేవాడు. ఒక ప్రక్క బంగారం పనిచేస్తూ వేరొక ప్రక్క రసాయన శాస్త్రాన్ని చదువుతూండేవాడు. కాలక్రమాన అతడు అసలు స్వర్ణకార వృత్తినే పూర్ణంగా వదలి రసాయన శాస్త్ర పరిశోధనల్తో కాలం గడపజొచ్చాడు. ఉన్నట్లుండి ఒకనాడాతడు కొండవీటి నుండి అంతర్హితుడయ్యాడు. ఆనాటినుండి విశ్వదాభిరామయ్య సంగతి ఎవరికీ తెలియదు.

కొండవీటి నుండి అతడు సమీపారణ్యానికి పోయాడు. ఆ అరణ్యం కొండలూ, గుట్టల్తో నిండి ఉంది. అందొక గుహను తనకు స్థావరంగా చేసికొని, అతడు పరిశోధనలు సాగిస్తున్నాడు. అరణ్యంలో పగలంతా సంచరించి తనకు కావలసిన మూలికలను తెచ్చుకుంటూంటాడు.

ఆనాటి రేయి కుంభవృష్టిని చూచి విశ్వదాభిరామయ్య మిగుల భయపడ్డాడు. మరునాడు తాను అరణ్యానికి పోయి మూలికలు సంపాదింపక పోతే పరిశోధనలను ఒకరోజంతా ఆపివేయవలసి వస్తుంది. నిరాశోపహతుడై ఉన్న ఆ కంసాలికి సూర్యోదయం ఆనందం చేకూర్చింది. మబ్బులు విచ్చిపోవటం చూచి అతడు సంతోషించాడు.

వాగులూ, వంకలూ అన్నీ ఏకమై ప్రవహిస్తూన్నాయి. వర్షానికి పుట్టలు నిండి ఊపిరాడక చెట్లపై ఎక్కిన సర్పాలిప్పుడు కిందికి జారుతున్నాయి.

మూలికలు దొరకటం కష్టంగా ఉంది. విశ్వదాభిరామయ్య ఈనాడు మరీ ఎక్కువ దూరం నడిచి వచ్చాడు. ఆ అడవి అంతా అతనికి సుపరిచితమే!

ఆతడట్లాగే వెతుకుతూ పోతున్నాడు.

ఒక గుట్ట పక్కన పడివున్న మానవశరీరాన్ని చూచి అతడు ఆశ్చర్యపడ్డాడు. నిర్జనమైన ఈ అరణ్యములో ఇతడిలా ఎందుకు పడి ఉన్నాడో! అని అనుకుంటూ వేగంగా ఆవ్యక్తి దగ్గరకు పోయి చూశాడు. తీర్చి దిద్దిన రూపురేఖల్తో ఉన్న ఆ మనిషిని చూచి ఆ విశ్వదాభిరామయ్య ఇతడెవరో రాజవంశస్థునిలాగా ఉన్నాడు. ఈ ముఖవర్చస్సు, విలువైన వస్త్రాలూ, ఆభరణాలూ అందుకు తగినట్లు ఉన్నాయి. పాపం! ఇటువంటి వానికి ఇంతటి దురవస్థ ఎలా సంభవించినదో? ఏదో విషంవలన ఇతడిలా పడిపోయినట్లుంది. ఏవిధమైన గాయమూ కాయంమీద లేకపోవటం చూస్తూంటే ఇతడు నిశ్చయంగా విషప్రయోగంవలననే పడిపోయి ఉంటాడనిపిస్తూంది! అని భావిస్తూ ఆవ్యక్తి నాడిని పట్టి పరీక్షించి చూశాడు. నయమే! ఇంకా ప్రాణాలు మాత్రం నిలిచి ఉన్నాయి. పాపం! వీనినెలాగైనా రక్షించాలి! అని నిర్ణయించుకున్నాడు. వెంటనే ఆ అరణ్యంలో ఉన్న కొన్ని ఆకుల్ని, చెట్ల బెరళ్లను తెచ్చాడు. ఆకుల్ని తన అరచేతుల్తో నలిపి, పసరును ఆవ్యక్తి కన్నుల్లో పిండాడు. చెట్టు బెరడులను వానినోటిలో పెట్టాడు.

కొద్ది నిమిషాలకే ఆతడు కన్నులు తెరిచాడు. విశ్వదాభిరామయ్య పెదాలపై దరహాసం మెరిసింది.

"ఆ.... అమ్మా!" అంటూ ఆ వ్యక్తి మూలిగాడు.

"అయ్యా ! మీరుమాటాడ వద్దు. అంతా సక్రమంగా సాగిపోతుంది.మీకు మళ్లా ఆరోగ్యం చేకూరుతుంది !" అంటూ విశ్వదాభిరామయ్య ఆ వ్యక్తిని తన భుజంమీద వేసుకొని తిరిగి తన గుహకు వచ్చాడు. గుహలో తనప్రయోగాలకోసం ఉంచిన కొలిమిని రగుల్కొలిపి, అచట ఆ వ్యక్తిని కూర్చుండబెట్టాడు. కాచపాత్రల్లో ఉన్న రసద్రవాల్ని కొన్నింటిని కలిపి ఆ మిశ్రాన్ని త్రాగించాడు. అతడు దాన్ని త్రాగింతరువాత సత్తువ తెచ్చుకున్నాడు. వానికన్నుల్లో మరి కొంత కాంతి కన్పించింది.

"ఇప్పుడు చెప్పండి ! మీరెవరు? "

"నన్ను, వేమారెడ్డి అంటారు !"

"మీరు చూస్తే రాజ వంశస్థుల్లా ఉన్నారు. మీ పేరు వేమారెడ్డి అంటున్నారు ! మా పెద కోమటి వేమ ప్రభువులకు మీరేమైనా చుట్టాలా?"

"అవును ! ఆయన మా తండ్రిగారే !"

"ఆ ! యువరాజులా !! మిమ్మగూర్చి నేను కొండవీటిలో ఉన్నప్పుడు విన్నాను. ఎప్పుడూ మీ దర్శనభాగ్యం లభించలేదు. అందువలన గుర్తింపలేక పోయాను. క్షమించండి. మీవంటి వారి కిటువంటి దురవస్థ కలగటం ఏమిటి ? ఎంత విచిత్రంగా ఉంది ! కొండవీటి ప్రభువులైన మా పెదకోమటి వేమారెడ్డిగారి పుత్రరత్నం ఇలా అసహాయుడై విష ప్రయోగం వలన అరణ్యంలో పడి ఉండటమా ! ఆహా ! ఏమి ఈ విధి విలాసం ! వేమారెడ్డిగారూ ! ధర్మ ప్రభువులైన మీ తండ్రిగారు కొండవీటిని పాలించుతూండగా ఇటువంటి అకృత్యమెలా జరిగింది ?"

"మా తండ్రిగారు మరణించి చాలా కాలమైంది !"

పిడుగువంటి ఈ వార్త విని విశ్వదాభిరామయ్య అదిరిపడ్డాడు. "అయ్యా ! నేను కొండవీటిని వదిలి పెక్కేళ్ళయింది. క్షమించండి. నాకు అచటి సంగతులేమీ తెలియవు. ఏ ప్రభువుకోసం నేనీ అరణ్యంలో అహోరాత్రాలూ శ్రమిస్తున్నానో ఆ ప్రభువే స్వర్గస్థుడయ్యాడు. హా ! హతవిధీ !" అంటూ పలుతెరగుల దుఃఖిస్తున్న విశ్వదాభిరామయ్యను చూచి 'ఇతడెవరో మాకు కావలసినవానివలె ఉన్నాడు ! మా తండ్రిగారికి తెలిసిన వాడై ఉంటాడు' అని మదిలో తలచాడు.

"అయ్యా! ఈ అభాగ్యునికి ప్రాణదాన మొనర్చిన మీ నామధేయం ఏమిటి? మీరెవరు? మీరు కొండవీటిని ఎందుకు విడిచారు? మా తండ్రిగారి కోసం మీరు అరణ్యంలో ఉండటం ఎందుకు? వారి మరణానికి మీరింతగా దుఃఖపడుతున్నారెందుకు? అంతా వింత వింతగా తోస్తున్న మీ చరిత్రను సెలవివ్వండి!",

"రెడ్డిగారూ! నన్ను విశ్వదాభిరామయ్య అంటారు. మేము విశ్వకర్మ వంశస్థులం. బంగారుపని మాకు వెన్నతో పెట్టినవిద్య. మాతాత పూర్ణయాచార్యులు గారు గొప్ప రసాయన శాస్త్రవేత్త. వారు జీవితమంతా పరిశోధనలో గడిపిరి. వారికి సంపాదనపై ఆశలేదు. వారి చూపులో బంగారం ఒక లోహం మాత్రమే! లోహమును గూర్చి ఎప్పుడూ పరిశోధన చేస్తుండేవారు. వారు మిగిల్చిన ఆస్తి ఒక తాళపత్ర గ్రంథము. ఆ తాళపత్ర గ్రంథమే వారికి సర్వస్వం. తమ పరిశోధనా ఫలితాలను అందులో పొందుపరిచారు. అది లోహాలను గూర్చిన శాస్త్రగ్రంథం. పదార్థము అణువుల సంయోగం వలన ఏర్పడిందని మీకు తెలుసుగదా!పరమాణువుల సంయోగం లోహాల తీరుతెన్నులను ఎలా మార్చివేస్తుందో వారు సూక్ష్మంగా పరిశీలించి ఆ గ్రంథాన్ని వ్రాశారు. నా అదృష్టవశాన ఆ గ్రంథం చిక్కింది. నేను చిన్నతనంనుండీ ఒకవైపు మా కులవిద్యను నేర్చుకుంటూ వేరొకవైపు ఆ శాస్త్రగ్రంథాన్ని చదివాను.కొన్ని మూలికల రసం ప్రభావంతో లోహాలలోని పరమాణు నిర్మాణాలు మార్పుచెంది, భిన్న లోహాలుగా మార్పుచెందే అవకాశం ఉంది. ఈ విషయాన్ని గ్రహించి, ఆమూలికలను పొందటానికి నగరంవిడచి ఈ అరణ్యాన్ని చేరాను. బంగారం చేయటానికి కృషిచేస్తున్నాను".

"మా తండ్రిగారితో మీకు స్నేహం ఉందా? వారేనా మిమ్ము బంగారం చేయమంది?"

"లేదు!వారు నన్నిక్కడకు పంపలేదు. కానీ, వారికోసమే నే నిక్కడకు వచ్చింది. కరువు కాటకాలతో అప్పుడు కొండవీడు అల్లాడుతూంది. పంటపొలాలు బీడుపోయాయి. ధర్మప్రభువులైన మీ తండ్రిగారు చేతకాసులు లేక అసహాయులై ఉన్నారు. బంగారమే కదా ఈ కలికాలంలో ప్రపంచాన్ని నడుపుతుంది! ఆ బంగారాన్ని చేసే ఉద్దేశంతో వెంటనే కొండవీటిని విడిచి ఈ అరణ్యానికి వచ్చాను. చాలా ప్రయోగాలు చేశాను. రేయింబవళ్లు శ్రమించాను. నా కష్టానికి తగినఫలం ఇప్పుడిప్పుడే లభిస్తున్నది. బంగారం చేశాను! కానీ దానికి వన్నెరాలేదు. కొద్దిరోజుల్లోనే నా రసాయన పదార్థాలు ఏ లోహాన్ని అయినా మంచి బంగారంగా మార్చేయగలవు!" అని మూలనున్న కొన్ని బంగారు ముద్దలను చూపించాడు. వేమారెడ్డి ఆ బంగారాన్ని చూచిఆశ్చర్యపడలేదు. అతడు నిర్వికారంగా చూస్తున్నాడు. యోగిలాగా చూస్తున్నాడంతే!

"విశ్వదాభిరామయ్య గారూ! నాకు బంగారంమీద మమకారం లేదు. ఐహిక విషయాలపై ఆసక్తి లేదు. ఈ ప్రపంచము ఒక చిక్కుప్రశ్నలా ఉందిప్పుడు నాకు. ఈ మాయ నాకు అర్థంకావటం లేదు. నమ్మినవారే నట్టేట ముంచుతున్నారు. అన్న ఎవరు? అంతా మిథ్య. మానవులు మాయలోపుట్టి మాయలో పెరుగుతున్నారు. ఆ మాయనే తెలుసుకోలేక పోతున్నారు. ఈ శాస్త్రాలన్నీ చావటానికి తప్ప మరి దేని కీ ఉపకరించటం లేదు, చావులేని జ్ఞానవిద్య ఏదైనా ఉంటే దాన్నిచదవాలి. జ్ఞాన హీనుడినయి ఇన్నాళ్లు త్రాటిని చూచి పాము అనుకొని భ్రాంతి పడ్డాను!".

"వేమారెడ్డి గారూ! మీకుజరిగిన అన్యాయం సామాన్యమైనది కాదు, గొప్ప అపకారం జరగటం వలన ఇలా వైరాగ్యపు పలుకులు పలుకుతున్నారు! మీకీద్రోహం చేసిందెవరు?"

"అయ్యా! నన్నలాగే అడవిలో విడచిఉంటే సుఖంగా ప్రాణాలు వదలిఉండే వాడిని. నన్ను బ్రతికించి, నా పాప కళంకమైన జీవితాన్ని మళ్ళా గుర్తుకు తెప్పిస్తున్నారు! నా జీవితాన్ని నేనే

నాశనం చేసుకున్నాను. మా వంశానికీ, ప్రతిష్టకు తీరని కళంకం ఆపాదించాను!"

"మీ బాధ ఏమిటో నాకు చెప్పండి. అందువలన తపించే మీ హృదయానికి శాంతి కలుగుతుంది!"

"నేనొక వేశ్యను మోహించి, నా సర్వస్వాన్ని దాని కర్పించాను, అదినాకు విషప్రయోగం చేసింది. కారణం నాకు తెలియదు. ఆ తరువాత జరిగిందీ నాకు తెలియదు! మూర్ఛిల్లాను!"

"ఎవరో మిమ్మల్ని ఈ అరణ్యంలో పారేసి ఉంటారు. నేనీ ఉదయం మూలికలకోసం వచ్చినప్పుడు మీరు కనబడ్డారు ! ... "

ఇలా ఆ యిద్దరూ మాటాడుకుంటూండగా ఎక్కడో దూరం నుండి గుఱ్ఱపు డెక్కల చప్పుడు వినబడింది! రాను రాను అది దగ్గరవుతూంది. ఎవరో ఇద్దరు వ్యక్తులు ఎవరినో వెదుకుతూ వస్తున్నట్లు విశ్వదాభిరామయ్య పసిగట్టాడు. మూలఉన్న మొద్దుసుత్తి చేతబట్టుకొని గుహనుండి బయటకు వచ్చాడు.

అశ్వారూఢులై వస్తున్న ఇద్దరువ్యక్తులు కనబడ్డారు. వాళ్లు విశ్వదాభిరామయ్యను సమీపించారు. అందులో ఒకడు బొంగురు గొంతుతో ఇలా అడిగాడు.

"ఇటుగా ఎవరైనా వచ్చారా? "

"ఏమో! నాకు తెలీదు! "

"నువ్విక్కడ ఏంచేస్తుంటావ్? "

"నీకెందుకు? "

"మాకు కావలసిన వ్యక్తి నీకేమైనా కనబడ్డాడేమో తెలుసుకొంటానికి! "

"అందుకు నేనేం చేస్తుంటానో తెలుసుకోవాలా ? నాకు తెలియదన్నానుగదా! "

"ఎవరూ కనపడ లేదన్నమాట! "

"లేదు, లేదు!! ఎన్నిసార్లు చెప్పాలి! "

దీంతో అతడు నిరాశపడి తన ప్రక్కనున్న వానితో ఇలా అన్నాడు.

"పెద్దన్నా ఈ అడవిలో ఎక్కడా జనసంచారం ఉన్నట్లు లేదు ఇప్పుడెలా....?"

"మన వేమారెడ్డిని ఈ మహారణ్యంలో ఎక్కడని వెతగ్గలం?" పెద్దన నిరాశగా పలికాడు.

ఈ సంభాషణంతా గుహలో నుండి వేమారెడ్డి వింటూనే ఉన్నాడు. తూలుతూ బయటకు నడిచాడు.

"మిత్రులారా ! పెద్దనా ! చామిసెట్టీ" అని చిన్నగా కేక వేశాడు.

ముందుకు పోతున్న మిత్రులు ఆ గొంతువిని సంభ్రమాశ్చర్యాలతో వెనక్కి తిరిగారు. 'వీడెవడో ద్రోహి. వేమారెడ్డిని బంధించి ఈగుహలో ఉంచాడు' అనుకొని పెద్దన్న కోపంతో కత్తి దూసి విశ్వదాభిరామయ్య మీదికి ఉరక బోయాడు గాని వేమారెడ్డి అడ్డుకున్నాడు.

"పెద్దనా ! ప్రాణాలిచ్చిన వాని ప్రాణాలు తీస్తావా? "

పెద్దన ఆశ్చర్యపోయాడు. సిగ్గుపడ్డాడు. విశ్వదాభిరామయ్య వైపు తిరిగి 'క్షమించండి' అని అన్నాడు.

"క్షమించాలిసింది నేనుగాదు మీరే ! వేమారెడ్డి గారికి ఆప్తులని తెలీక అబద్ధమాడాను".

వేమారెడ్డి కలగజేసుకున్నాడు.

"విశ్వదాభిరామయ్యగారూ ! వీళ్లు నా ప్రాణమిత్రులు........ పెద్దన.... చామిసెట్టి !"

"అయ్యా ! విశ్వదాభిరామయ్య మీకు నమస్కరిస్తున్నాడు !" అని విశ్వదాభిరామయ్యే నమస్కరించాడు.

వందన ప్రతి వందనాలైనాయి. ముగ్గురూ గుహలోనికి పోయారు. ఒకరి సంగతి ఒకరు తెలుసుకున్నారు.

"వేమారెడ్డీ ! నీ అన్నా, ఆదుష్టమంత్రి పన్నిన పన్నాగమే దీనికంతా కారణం. కొండవీటిలో అరాచకం ప్రబలింది. రాచవేముని దురాగతాలకు అంతులేదు. ఆ తురగారాముని మాటలు విని పురిటిపన్ను గూడా విధించాడు రాజు !" చామిసెట్టి ఆవేశంగా చెబుతున్నాడు.

"పురిటి సుంకమా !" వేమారెడ్డి ఆశ్చర్యపడ్డాడు.

"వేమారెడ్డీ ! ఊ అనుచాలు ! ఆ దుర్మార్గుల ఆటల్ని కట్టిస్తాం. రాచవేమారెడ్డిని గద్దె దింపుతాం. మిమ్మల్ని ప్రభువుగా జేస్తాం.... ! "

"పెద్దనా ! అటువంటి మాటలు వద్దు ! " పెద్దన మాటల్ని వేమారెడ్డి మధ్యలోనే త్రుంచాడు. పెద్దన బాధతో మళ్లీ ఇలా అన్నాడు.

"వేమారెడ్డి ! దేశస్థితిని గమనించకుండా మాటాడుతున్నావ్. దేశక్షేమం ఆలోచించి ఈ నిర్ణయానికి వచ్చాను. మీ అన్నగారి అవక తవక పాలనతో విసిగి పోయిన ప్రజానీకం ఈ మార్పుకు హర్షిస్తుంది. నా మాటలు విశ్వసించు ! "

చామిసెట్టి ఆసక్తితో చూస్తున్నాడు.

"మిత్రులారా ! రాజ్యపాలనమంటే మాటలు గాదు! నా కనుభవం లేదు ! ధనమూలేదు. ధనహీనుడైన రాజేం చేయగలడు ? నాకీ లోకంమీద విరక్తి కలిగింది. ఆశలనే త్రాళ్లు సమస్త ప్రాణుల్ని కట్టివేస్తున్నాయి. ఇప్పుడు నేను జ్ఞానమనే ఖడ్గంకోసం వెదుకుతున్నాను. ఆశల త్రాళ్లు త్రెంపటానికి జ్ఞానఖడ్గమే సరియైన ఆయుధంగదా ! అదీకాక—కొక్కు తిండి కోసం ఆశపడి బోనులో చిక్కుకోవడం మనకు తెలుసు గదా ! అట్లాగే ఈ పదవీ వ్యామోహం వల్ల మళ్లా ఈ లోకమనే బోనులో చిక్కవలసి

వస్తుంది, కాలవాహినిలో కొట్టుకొని పోతున్నాను. ఎదురీత చేత గాక చచ్చిపోయాను ! కాలవహ్నికి లక్క కరిగినట్లు ఇంతిని జూచి నా మనసు చెడింది. ఇక రాజ్యం ఎందుకు ! కాయమున్నప్పుడే జ్ఞానమార్గం తెలుసుకోవాలిగదా ! మిత్రులారా....నాకు చేతగాని పనిని నాకంట గట్టవద్దు ! "

వేమారెడ్డి వైరాగ్యంలో పడిపోతున్నాడని విశ్వదాభిరామయ్య గుర్తించాడు. దీన్ని వెంటనే ఖండించకపోతే మితిమీరిపోయే ప్రమాదముందని యోచించి ఇలా పలికాడు.

"వేమారెడ్డిగారూ ! రాజవంశములో పుట్టి యిట్టి మాటలన దగదు. మనుజుడై పుట్టిన తరవాత కష్టాలు తప్పవు. నరుడెంత అధముడైనా అర్థవంతుడైతేచాలు. వాని మాట మీద ప్రపంచం నడుస్తుంది. ఇక మీ వంటి వారి సంగతి వేరే చెప్పాలా ? నిర్ధనుడైనవాడు విరాగి అవటంలో ఆశ్చర్యంలేదు. ధనం మీ చెంత లేదనే చింతవద్దు ! సుఖం పొందటానికి హేమతారక విద్య మన దగ్గరుంది. కలికాలంలో కలిమికి గౌరవం హెచ్చు ! ఇహ లోకంలో ధనం లేకపోతే సుఖంలేదు. ఇక్కడ సుఖం లేకపోతే పరంలో గూడా సుఖం ఉండదు. ఆ పరమ సత్యాన్ని గుర్తించే నేను బంగారాన్ని చేయడానికి ప్రయత్నిస్తున్నాను. తల్లీ బిడలకు తగవు పుట్టించే ధనం వలన సుఖం లేదని చెబుతారు ! కాని ఆ ధనం లేకపోతే జీవించటం ఎలా ? ధనం లేకపోతే ధైర్యం చిక్కదు. ధైర్యం లేకపోతే ధనం రాదు. ధనం ధైర్యం లేని మానవులు జీవించటానికి అనర్హులు. లేమిలో ఉన్న వాడు ఏం చేసినా కలిసిరాదు. కాసులున్న చోట అంతా కలిసి వస్తుంది. కాబట్టి మీరూ ప్రభువులు కాండి. ధనాన్నీ, కీర్తినీ సంపాదించండి ! "

చామి సెట్టి అందుకున్నాడు. "వేమారెడ్డీ! ధనవాన్ సర్వత్ర పూజ్యతే అని మీకు తెలుసు. ధనం లేకపోవడం వలన గుణం కూడా తక్కువై పోవచ్చు. ధనం లేకపోతే కీర్తి పోతుంది. ముక్తిని పొందడానికి మనసు ఎలామూలమో అలాగే సకల ధర్మాలకూ ధనమే మూలం ! అటువంటి ధనం నాదగ్గర విస్తారంగా ఉంది. అది మీలాంటి ప్రభువులకే ! దాన్ని ఉపయోగించడానికి తగిన అదునిదే ! నేను సింహ విక్రమ పురికి పోయి ఆ ధనమంతా తెస్తాను ! "

పెద్దన పలికాడు.

"మిత్రమా ! వల్లె అను ! నేనీక్షణమే పోయి కొండవీట నా ప్రయత్నాలు మొదలు పెడతాను. కొద్ది దినాలకే మిమ్మల్ని ప్రభువులుగా చూడగలం ! "

వేమారెడ్డి ఆలోచనలో పడాడు.

అతడు మెత్తబడుతున్నాడని విశ్వదాభిరామయ్య గ్రహించాడు.

"రెడ్డిగారూ! నా ప్రయత్నాలు, ప్రయోగాలూ మీకు తెలుసు. నేను చేసే బంగారం మీ తండ్రిగారికిచ్చి కొండవీటి దారిద్ర్యాన్ని పోగొట్టాలనుకొన్నాను. కాని ఆయన స్వర్గస్థుడైనాడు. ఇప్పుడా స్థానాన్ని పొందండి !"

ఆ మాటలు విన్న వేమారెడ్డికి తండ్రిగారు అవసాన సమయంలో చెప్పిన స్వర్ణయోగం తటుక్కున గుర్తొచ్చింది.

వేమారెడ్డి 'మీ ఇష్టం' అన్నాడు. అంతా సంతోషించారు. తరువాత కొంతసేపు కర్తవ్యాన్ని గూర్చి చర్చించుకున్నారు. భవితవ్యాన్ని గూర్చి భావించుకొన్నారు. నిర్ణయాలు చేసుకున్నారు.

మిత్రులు సెలవు తీసుకున్నారు.

చామిసెట్టి సింహ విక్రమ పట్టణం వైపుకు అశ్వాన్ని పోనిచ్చాడు. పెద్దన్న కొండవీటి దిశకు గుర్రాన్ని దౌడు తీయించాడు.

విశ్వదాభి రామయ్య వేమారెడ్డిని కంటికి రెప్పవలె కాపాడుతున్నాడు. నెమ్మదిగా వేమారెడి కోలుకున్నాడు. పూర్వపు జవసత్వాలు తిరిగి చేకూరాయి.

విశ్వదాభిరామయ్య చేసే ప్రయోగాలు చూచి వేమారెడ్డికి రసాయన శాస్త్రంలో ఆసక్తి పుట్టింది. విశ్వదాభిరామయ్య వెంట తానూ అరణ్యంలోకి పోయి మూలికలు వెదకి తెస్తున్నాడు. తానూ ఆ ప్రయోగాల్లో భాగం పంచుకుంటున్నాడు. రోజులు గడుస్తున్నాయి. వేమారెడిలో అపూర్వమైన మార్పు వచ్చింది. ఇప్పుడాతని మనస్సులో బంగారం మెరుస్తూంది. తాను ప్రభువు కావాలి. తన కన్యాయంచేసిన వారిని శిక్షించాలి. తనకు స్వర్ణయోగం సిద్ధిస్తుంది. బంగారానికి ఇప్పుడిప్పుడే వన్నె వస్తూంది. రేపో మాపో అది సిద్ధమవుతుంది....! ఇట్టి ఆలోచనలు చెలరేగాయి.

విశ్వదాభిరామయ్య అదే పనిగా ప్రయోగాలు చేస్తున్నాడు. వేమారెడ్డికి జరిగిన అన్యాయం గుర్తుకొచ్చినప్పుడల్లా ఆయన ఉత్తేజితుడవుతున్నాడు. 'ఎట్లాగయినా వేమారెడ్డి ప్రభువు కావాలి. తన హేమ తారక విద్య సార్థకం కావాలి !' అనే నిశ్చయంతో అతడు నిత్యం ప్రయోగాలు చేస్తున్నాడు. ఆకలి దప్పులు మరచి పోతున్నాడు. గుహను దాటి బయటకు రావటంలేదు. వేమారెడ్డి మూలికలు వెదికి తెస్తున్నాడు.

ఒకరోజు వేకువ జామునే వేమారెడ్డి కాల కృత్యాలు తీర్చుకొని, ప్రయోగాలకు కావలసిన మూలికలు తేవడానికి అరణ్యంలోనికి బయలు దేరాడు. చాలా దూరం పోయాడు. ప్రతిరోజూ ఆయరణ్యంలో తిరుగటం వలన ఆ ప్రదేశమంతా వేమారెడ్డికి కొట్టిన పిండి అయింది.

(సశేషం)

# మన జిల్లాల్లో ఏం జరుగుతోంది?

—జిల్లా సమాచార లేఖలు—

## హరిజనులకు భూముల పంపిణీ

భారతదేశ సంస్కృతీ పునరుజ్జీవనానికి భారతీయుల జీవన ప్రమాణ ప్రగతికీ వ్యవసాయ కార్మిక సంక్షేమం ముఖ్యం — ఈ కార్యక్రమాన్ని రూపొందించి నిర్వహించడంలో అనేక సదుపాయాలు, సదవకాశాలు కల్పిస్తున్నారు. తత్ఫలితంగా ప్రతి తాలూకా వ్యవసాయ కార్మికులకు తదితర బలహీన వర్గములకు వ్యవసాయ క్షేత్ర ప్రదానం జరుగుతున్నది.

41,000 ఎకరాల భూమి పంపకానికి అనువుగా వున్న కందుకూరు తాలూకాలో 1975 జూన్‌కు ముందున్న అయిదు సంవత్సరాల కాలంలో 17,800 ఎకరాలు మాత్రం పంపిణీ చేయబడినది. అనంతరం 20,500 ఎకరముల భూమి పంపణీ చేయడం జరిగింది. యీ స్వల్ప వ్యవధిలో ఉన్న భూమిలో యించుమించు సగం పంపిణీ చేశారు. ఈ పంపకంలో షెడ్యూలు జాతులకు, దళిత వర్గాలకు అధిక ప్రాధాన్య మివ్వబడింది. నిరుపేదలైనయితర జాతులుకూడ విస్మరించబడలేదు.

తాలూకా వారీ వివరాలు

| | సంఖ్య | విస్తీర్ణం (ఎకరాలు) |
|---|---|---|
| షెడ్యూలు కులములు | 7151 | 22331.00 |
| ,, జాతులు | 1688 | 4354.00 |
| వెనుకబడిన జాతులు | 1070 | 3581.00 |
| ఇతర పేదలు | 3470 | 8097.00 |
| మొత్తం | 13,379 | 38,363.00 |

ఇంతకు ముందు మంజూరు కావలసిన భూములను ఆయా వ్యక్తులకు చూపించి స్వాధీనం చేయడం జరిగింది. యింతవరకు 89 గ్రామములలో 2513 మందికి భూమి స్వాధీనం చేయడం జరిగింది.

1500 ఎకరములకు మించిన భూమి ఒకే ప్రాంతంలో భూమి లేని పేదవారికి పంచి పెట్టడం ప్రకాశం జిల్లా చరిత్రలో సువర్ణాక్షరాలలో లిఖింపదగిన అంశం.

పదేండ్ల క్రితం హరిజనులు కాలు పెట్టడానికికూడా అనుమతించని భూమిని ప్రకాశం జిల్లా కలక్టర్ శ్రీ కె. స్వామినాథన్‌గారు దర్శించి పదిరోజులలో హరిజనులకు పట్టాలు యిప్పించడమేగాక భూమి స్వాధీనం చేసే ఏర్పాట్లు చేశారు. రివిన్యూ శాఖామాత్యులు గౌ॥ శ్రీ పి. నరసారెడ్డిగారు స్వయంగా ఆ ప్లాటును దర్శించి అందులో దొరపొగాకు నాటివుండడం గమనించారు. నాటి బహిరంగ సభలో ఆ గ్రామానికి చెందిన హరిజనుడు శ్రీ ముప్పాళ్ళ వెంకటేశ్వర్లు హరిజనులు ఆఫీసుల చుట్టూ తిరగనవసరం లేకుండా రివిన్యూ సిబ్బంది తమ గ్రామములోనే మకాం పెట్టి తాము కాలు పెట్టడానికి కూడా అనుమతించని భూమిని పట్టాలు యిచ్చి స్వాధీన పరచినందుకు ఆనంద భాష్పాలతో కృతజ్ఞత తెలిపారు.

—శ్రీ బి.ఆర్.నాయుడు

## రాయదుర్గం సమితిలో సమిష్టి వ్యవసాయపు బావులు

రాయదుర్గం పంచాయతీ సమితిలో గలగల గ్రామంలో 62 మంది వెనుకబడిన జాతుల, వర్గములవారితో సమిష్టి వ్యవసాయ సహకార సంఘం ఇటీవల నమోదు చేశారు. భూసంస్కరణల చట్టం వల్ల గ్రామంలో సంక్రమించిన 239.23 ఎకరముల ఏకఖండ భూమిని సభ్యులందరికీ పట్టాలు యిచ్చి పంపిణీచేశారు. క్షేత్రంలో క్షామనివారణ పథకం క్రింద, పది సమిష్టి వ్యవసాయ నీటిపారుదల బావులను త్రవ్వుటకుగాను ప్రభుత్వం 1,00,000 రూపాయలను మంజూరు చేసింది. ఈ మొత్తంలో 50 శాతం జిల్లా క్షామనివారణ ప్రాంత పథకంక్రింద సబ్సిడీగా ఇస్తారు. మిగిలిన మొత్తంలో 20 శాతం అప్పుగా షెడ్యూలు కులాల సహకార సంఘంవారు, 30 శాతం తక్కావి రుణములక్రింద మంజూరు చేశారు.

ఈ కార్యక్రమాన్ని చురుకుగా కొనసాగించుటకుగాను జిల్లా కలెక్టరు రాయదుర్గం బ్లాకు డెవలప్‌మెంట్ ఆఫీసర్, అధ్యక్షతన 9 మంది సభ్యులతో ఒక కమిటీని నియమించారు. ఇప్పటికి నాలుగు బావులలో నీరు లభ్యమైనది. మిగతా బావుల కార్యక్రమం రెండు నెలల లోపల పూర్తి చేయుటకు తీవ్రప్రయత్నములు జరుగుతున్నాయి.

ఈ కార్యక్రమంక్రింది 62 కుటుంబాలకు శాశ్వత జీవనోపాధి కలుగుతుంది. సుమారు 70 ఎకరముల భూమి అదనపు నీటి పారుదల క్రిందికి వస్తుంది. మిగిలిన 170 ఎకరములలో, మెట్ట

వ్యవసాయం చేస్తారు. ఈ కార్యక్రమాన్ని సకాలంలో పూర్తి చేసేందుకు సభ్యులు, అధికారులుదీక్షతో పని చేస్తున్నారు.

—శ్రీ ఎస్. సూర్యనారాయణశెట్టి

## చట్టి గ్రామంలో సామూహిక పాడిపరిశ్రమ కేంద్రం

ఖమ్మం జిల్లా భద్రాచలం తాలూకాలోని చట్టి గ్రామంలో రు. 39776 వ్యయంతో ఒక సామూహిక పాడి పరిశ్రమ కేంద్రాన్ని ఖమ్మం జిల్లా సమీకృత గిరిజనాభివృద్ధి సంస్థ గిరిజనులకొరకై ప్రారంభించింది. ఈ కేంద్రానికి ఏప్రిల్ 1న ఖమ్మం జిల్లా కలెక్టర్ ప్రారంభోత్సవం చేశారు. ఈ పరిశ్రమకు కావలసిన నిధులలో 50 శాతం ఖర్చులు గిరిజనాభివృద్ధి సంస్థ భరించగా మిగతా 50 శాతం ఖర్చును చింతూరులోని నాగార్జున బ్యాంకు శాఖ రుణంగా మంజూరు చేసింది. ఈ కేంద్రానికి 22 మేలుజాతి గేదెలను అందించారు. సంఘంలోని 22 మంది సభ్యురాండ్రు గిరిజన స్త్రీలే కావడం ఒక విశేషం - పశుగ్రాసోత్పత్తికిగాను 3 ఎకరముల భూమిని, ఒక ఆయిలు ఇంజనును ప్రభుత్వం అందజేసింది. పశువులకై పుష్టి కరమైన దాణాను, రోగ నిరోధక ఔషధాలను, పశువుల ఆరోగ్య పరిరక్షక సిబ్బందినిగూడా సమకూర్చారు. రు. 19,000ల ఖర్చుతో ఒక షెడ్డును కూడా నిర్మించారు.

—శ్రీ హరి గోపాలకృష్ణ

## కొత్తగూడెం సమితిలో భూగర్భ జలాల వినియోగం

ఖమ్మం జిల్లాలోని కొత్తగూడెం పంచాయతీ సమితిలో 61,557 ఎకరాల సాగుకు యోగ్యమైన భూమిలో కేవలం 5004 ఎకరాలకు మాత్రమే నీటిపారుదల సౌకర్యం ఉంది. సన్నకారు రైతులకు ప్రయోజనం కలిగే విధంగా ఈ బ్లాకులో విస్తృత ప్రాతిపదికపై 500 వ్యవసాయ బావుల నిర్మాణానికి గాను ఒక బృహత్తర ప్రణాళిక తయారు చేశారు. ఐదు ఎకరాలు, అంతకు తక్కువ భూమిగల రైతులకు ఈ బావుల నిర్మాణానికి ఒక్కొక్కరికి రూ. 5000—00 వరకు రుణం ఇవ్వబడుతుంది. సరాసరి ఒక్కొక్క బావి క్రింద 3 ఎకరాలు సాగవుతుందని అంచనా. ఈ బావుల నిర్మాణ కాలం మొదలు గాక పూర్వమే పూర్తి చేయబడి మొత్తం 1500 ఎకరాలు నీటి పారుదల క్రిందికి వస్తుంది. తాలూకాలో వున్న ఇతర వాణిజ్య బ్యాంకులు గాక ఈ మధ్య పెనుబల్లి, పాలవంచ, చంద్రుగొండ, ఏనుకూరు గ్రామాలలోనెలకొల్పిన నాగార్జునగ్రామీణ బ్యాంకులు ఈ చిన్న రైతులకు రుణాలు మంజూరు చేయుటకు ముందుకు వచ్చి ఇప్పటికే సుమారు 200 బావులకు అప్పులు ఇచ్చాయి. అనేక చోట్ల బావుల నిర్మాణం చురుకుగా సాగుతూంది. సన్నకారు రైతులకు ఈ అవకాశం ఎంతో ప్రోత్సాహాన్ని కలుగజేసింది. గ్రామీణ బ్యాంకు మేనేజర్లు, మండల వికాసాధికార్లు, జిల్లాలోని సన్నకారు రైతుల అభివృద్ధి సంస్థ అధికార్లు చిన్నరైతుల సమస్యల పట్ల చూపుతున్న శ్రద్ధ ఎంతోకొనియాడ తగినది. వారు ప్రతి రైతు పొలానికి వెళ్ళి వారి అవసరాలను గుర్తించి అవసర మున్నంత మేరకు రుణాలు మంజూరు చేస్తున్నారు.

—శ్రీ టి. ఆనందరావు

## గుత్తిలో రాత్రిపాఠశాలలు

ఇటీవల రాష్ట్ర ప్రభుత్వశాఖ ప్రాథమిక విద్యా విస్తరణకై కొన్ని ప్రాంతములను ఎన్నిక చేసి రాత్రి పాఠశాలలు ప్రవేశ పెట్టింది. అనంతపురం జిల్లాలో గుత్తి సమితిని జిల్లా విద్యా శాఖాధికారి గారు ఎన్నిక చేశారు.

విద్యావిస్తరణాధికారి ఉపాధ్యాయుల సహాయముతో సర్వే చేయగా, షెడ్యూలు కులాలకు, వెనుకబడిన తరగతులకు చెందిన కులాలవారిలో బడి ఈడుగల బాల బాలికలు గ్రామాలలో దాదాపు 28 శాతము పగటివేళ బడికి హాజరయ్యేందుకు వీలులేని వారని తెలిసింది. వీరి సౌకర్యార్థము రాత్రివేళ పాఠశాలలు ప్రవేశపెడితే తమ పిల్లలను బడికి పంపేందుకు తల్లిదండ్రులు సమ్మతించారు.

గుత్తి సమితిలోని ఐదవ వార్డులోనూ రైల్వేస్టేషనులోనూ, ఒకటవ, ఐదవ వార్డులలో ఎద్దులపల్లి, పెద్దవడగూరు గ్రామాలలో ఆరుచోట్ల రాత్రిపాఠశాలలు 1976 డిసెంబరులో ప్రవేశ పెట్టబడినవి.

ప్రయోగాత్మకంగా ప్రారంభింపబడిన ఈ పాఠశాలల ప్రయోజనం నేడు కానవస్తుంది. 257 మంది బాలురు 170 మంది బాలికలు చదువుకుంటున్నారు. వీరందరూ పేదవారే కనుక పలకలు కొనుగోలు ఇబ్బందివుంది. స్వేచ్ఛా సంస్థలద్వారా, జిల్లా సాంఘిక సంక్షేమ అధికారిద్వారా కొంత ఉపశమించింది. యువజనులు, పాఠశాల కమిటీలు పలకలు, పుస్తకములు ఉచితంగా సరఫరా చేస్తారు. ఇప్పుడు రాత్రి పాఠశాలల్లో పిల్లల తల్లిదండ్రుల్లో వ్యవసాయం చేసేవారు 26గురు, కూలీలు 83మంది, దర్జీపనివారు 14గురు, వ్యాపారము చేసేవారు 20మంది, రజకులు 10మంది, ఇతరులు 14మంది వున్నారు.

రాత్రి పాఠశాలలు ఉత్సాహంతో సమర్థవంతంగా పని చేసేందుకు, కరెంటు వున్నచోట కరెంటు బిల్లులు సమితి భరిస్తుంది. కరెంటు లేనిచోట్ల పెట్రొమాక్సులైట్లు, కొవ్వొత్తులు, కిరసనాయిలు సరఫరా చేయుట, రాత్రిపాఠశాలల ఉపాధ్యాయులకు వేసవిలో శలవు మంజూరు ముఖ్యమైనవి. ప్రభుత్వము ప్రవేశపెట్టిన ఈ పథకము వెనుకబడిన వారికి చదువుకోవాలని ఆశవుండి పగలు చదువుకొనుటకు వీలులేని పిల్లలకు ఒక వెలుగు.

—శ్రీ డి. కృష్ణమూర్తి

## వ్యవసాయాభివృద్ధి సహకార బ్యాంకు

తూర్పు గోదావరి జిల్లాలో ఎల్లవరం తాలూకా ఏజన్సీ ప్రాంతం. 2201కి.మీ. విస్తీర్ణము గల యీ తాలూకా చక్కటి అటవీ సంపదకు ఆలవాలము. వ్యవసాయానుకూలమగు 65338 ఎకరాల

మంచి భూమివుంది. కన్నేరు, పడేరు, ఏలేరు మొదలగు కొండ వాగులకు యీ తాలూకా పుట్టినిల్లు, అయినా తరుచు కరువుకు గురి అవుతూవుంటుంది. ఈనీరు ఆనకట్టలు లేక, గిరిజనులకుపయోగ పడక, ప్రకృతి ప్రసాదించిన వర్షం మీద ఆధారపడుతూవుంటారు. ఆర్థికంగా వెనుకబడిన యీ అభాగ్యజీవులకు ఆశాకిరణంగా 1974 సెప్టెంబరులో అడతీగల వ్యవసాయాభివృద్ధి సహకార బ్యాంకు ఆవిర్భవించింది.

ఈ బ్యాంకులో 1977 మార్చి నాటికి 1818 మంది సభ్యులు వున్నారు. వీరందరికీ భూమి సాగు, తోటల పెంపకము, ఆయిల్ యింజనులు, ట్రాక్టర్ల సదుపాయములకు రూ. 8,26,712– లు, చిన్న నీటి వనరుల అభివృద్ధికి రూ. 2,60,288/– వెరశి రూ. 10,97,000/ లు రుణముగా పంచి యిచ్చారు. 11 బోరింగు నూతులు, 28 వ్యవసాయ నూతులు, 4 నూతుల మరమ్మత్తు, 18 ఆయిల్ యింజనులకు రూ. 4,12,000/–లు ఖర్చు చేశారు. 230 మంది సన్నకారు రైతులకు రూ. 675,000/–లు, 110మంది యితర రైతాంగానికి రుణముగా పంచి యిచ్చారు. వీరిలో 309 మంది గిరిజనులకూ 5,50,278/– రూ॥లు యిచ్చి మిగిలినది 31 మంది యితర రైతులకు యిచ్చారు.

రాజ ఒమ్మంగి పంచాయతీ సమితిలో మడేరు ప్రాజెక్టు క్రింద రూ 1,80,697/–లు ఖర్చుతో 517 ఎకరాల ఆయకట్టు అభివృద్ధికి 71 మందికి, ఓకు రి స్కీము క్రింద రూ 9,800/– ఖర్చుచేసి 62 ఎకరాల అభివృద్ధికి 8మందికి, మంగలి గెడ్డ స్కీము క్రింద రూ 9800/–లు ఖర్చుతో 35 ఎకరాల అభివృద్ధికి 4 గురికి, కొండపల్లి వాగు స్కీము కింద రూ. 13,100–/ ఖర్చుతో 62 ఎకరాల అభివృద్ధికి 8 మందికి, పాలగెడ స్కీము క్రింద రూ. 6450/–లు ఖర్చుతో 29 ఎకరాల అభివృద్ధికి యిద్దరికి రుణముగా మంజూరు చేసి, నిరర్థకముగా పారుచున్న కొంత కాల్వల నీరు రైతులకుపయోగమునకు సాయము చేశారు.

అడ్డతీగల పంచాయతీ సమితిలో మొల్లేరు గ్రామస్తుడు శ్రీ కాటు మహేశ్వరస్వామికి స్వయం ఉపాధి కల్పన పథకము క్రింద రూ. 76,790/–లు రుణంగా మంజూరు చేసి ఒక ట్రాక్టరు, యితర పరికరములు యీ బ్యాంకు నుంచి యిచ్చారు.

—శ్రీ పి. వి. సుబ్బారావు

## కందుకూరులో వర్జీనియా పొగాకు

కర్నూలు జిల్లాలోని మార్కాపురం, గిద్దలూరు తాలూకాలు, నెల్లూరు జిల్లాలోని కందుకూరు, కనిగిరి, పొదిలి తాలూకాలు, గుంటూరు జిల్లాలోని ఒంగోలు, అద్దంకి చీరాల తాలూకాలు, కలిసి ప్రకాశం జిల్లా రూపొందింది. ఈ జిల్లాలో మాగాణి పైరుగా వరి, మెట్టపైరుగా జొన్న, వరిగ, కొర్ర, ఆరిక, రాగి పంటలు పొగాకు, ప్రత్తి, వేరుసెనగ, మిరప వాణిజ్యపంటలు కంది, పెసర, మినుము పప్పుదినుసులు, నువ్వు ఆముదము మొదలగునూనెగింజలు పండించుచున్నారు.

ఈ జిల్లా వ్యవసాయకంగా ఒంగోలు, కందుకూరు, మార్కాపురంమండలములుగావిభజించబడినది కందుకూరు మండలము, వర్జీనియా పొగాకుకు ప్రశస్తమైనది.75.1 వర్జీనియా పొగాకు ఈ మండలము నందు పండించ బడుచున్నది. వర్జీనియా పొగాకు ఆగస్టు, సెప్టెంబరు నెలలందు తేలిక నేలలందు; అక్టోబరు, నవంబరు నందు నల్లరేగడి నేలల్లోను నాటుచున్నారు.

1966 వ సం॥నకు పూర్వము వర్జీనియా పొగాకు నల్ల రేగడి నేలలకు మాత్రము పరిమితమై యుండినది. 1966 సం॥ కేంద్ర ప్రభుత్వ సహకారముతో తేలిక నేలలందు వర్జీనియా పొగాకు పండించు పథకము ప్రవేశ పెట్టబడినది. తేలిక నేలలందు పొగాకు పండించు రైతులకు ప్రోత్సాహము కలిగించుటకై రాష్ట్ర ప్రభుత్వము వ్యవసాయ సిబ్బందిని ప్రత్యేకముగా నియమించినది. ఈ సిబ్బందికి ప్రత్యేక శిక్షణ నిచ్చి కనిగిరి కేంద్రముగా పొదిలి, దర్శి, కనిగిరి, కందుకూరు తాలూకాలందు వ్యవసాయాధి కారులు నియిమింప బడిరి. వారి ద్వారా తేలిక నేలల్లో వర్జీనియా పొగాకు పండించు రైతులకు బారను నిర్మాణమునకు; బావులు తవ్వించుకొనుటకు రుణము కొంత భాగము సబ్సిడీగా నిర్ణయించి యివ్వబడినది. నారునకు సస్యరక్షణలకు సబ్సిడీలు యివ్వబడినవి.1966 సం॥ నుండి ఈ పథకము యొక్కకృషిచే పైనాలుగు తాలూకాల రైతులు వర్జీనియా పొగాకు తేలిక నేల లందు పండించుట ప్రారంభించిరి. విదేశీయులకు ఈ పొగాకు ఎంతగానో నచ్చుతుంది. ఎగుమతులు ఎక్కువ యినవి. అందువలన ఈ పొగాకునను ప్రత్యేకమైన ధరలు యీయ్యబడినవి.

కనిగిరి, పొదిలి, తాలూకాలందు మరియే యితర పైరు పండించినారాని లాభను వర్జీనియా పొగాకు తెచ్చినది. ఈ పొగాకు వుత్పత్తి పెరుగుటచే ఈ తాలూకాలందు వ్యవసాయకూలీలకు చేతి నిండా పనివుంది. ఆకువలచుట,నాట్లు వేయుట మొదలైన పనులకు కూలీలు కాంట్రాక్టు పద్ధతిన పనులు చేయుచున్నారు. ఈ మండలమునందు శింగరాయిలో 5 రీడ్రైయింగు ఫ్యాక్టరీలు నెలకొల్పబడినవి.

—శ్రీ జి. కృష్ణమూర్తి

సీరియల్ :

# నిరాశలో నిండు గుండె

– సి. ఆనందారామం

## జరిగిన కథ

శ్యామ్ తండ్రి జనార్దన్ వద్ద పెరిగిన సి.ఐ.డి. అధికారి మోహన్ లోటస్ హోటల్ యజమాని సాంబశివం చేస్తూన్న దొంగనోట్ల వ్యాపారం పట్టివ్వడానికి ప్రయత్నిస్తున్నాడు. ప్రసూన చిరంజీవి మోహన్‌కు సహాయం చేస్తున్నారు. ఈ కేసు నుండి ప్రసూనను దూరం చేయమని సుశీలను కోరుతాడు శేఖర్. పరమేశ్వరి సహృదయుల సాయంతో కూలిపేటలో అనాథసేవ చేస్తూంది.

జపాన్ త్రి-ఇన్-వన్ సెట్టు రేఖ ప్రోత్సాహంతో దొంగిలించి పట్టుబడిపోతాడు శ్యామ్. శ్యామ్ దొంగతనం చేస్తూండగా తీసిన ఫోటోలను తనకిచ్చి అతడిని వదిలివేయమని ప్రాధేయపడి మోహన్‌ను అక్రమ ప్రవర్తనకు గురిచేస్తాడు జనార్దన్. సుశీలను, శేఖర్‌ను ఎవరో హత్య చేస్తారు. లలిత ఆ శోకం భరించలేక స్మృతితప్పి పడిపోతుంది.

## 23

సుశీల మరణ వార్త విని ప్రసూన తల్లడిల్లి పోయింది. విన్నది విన్నదిగా లలిత దగ్గర కొచ్చేసింది. అప్పటికి లలిత స్పృహలో లేదు.... తెలిసీ తెలియని కోమాలో ఏదేదో కలవరిస్తోంది.

"అమ్మా !" అంది ప్రసూన లలిత దగ్గరగా వచ్చి ........

"సుశీ ! " అంది ఒక్కసారి లలిత ఆత్రంగా........

"వచ్చావా, సుశీ ! రావేమో అనుకున్నాను. నన్ను విడిచి వెళ్ళి పోయావనుకున్నాను. ఇంక బ్రతకట మెందుకనుకున్నాను. వచ్చేసావు....నాకు తెలుసు ! నా సుశీల నన్ను వదలి ఉండలేదు."

ప్రసూన రెండు చేతులు ఆప్యాయంగా పట్టుకుంది. ఏం చెయ్యాలో, ఏం మాట్లాడాలో అర్థంకాక అయోమయంగా ఉండి పోయింది ప్రసూన....

డాక్టరు ప్రసూనను ప్రక్కకు పిలిచాడు.

"ఆవిడ ప్రస్తుతం ఏదీ అర్థం చేసుకునే దశలో లేదు .... నిన్ను సుశీల అనుకుంటోంది. ఆవిడ బ్రతకాలంటే నువ్వు సుశీల లాగే నటిస్తూ ఆవిడను వదలకుండా ఉండాలి..........మూడు నాలుగు రోజులు కావచ్చు..........వారం రోజులు కావచ్చు........"

"ప్రసూనా ! ప్లీజ్ !" కన్నీళ్ళతో అడిగాడు సాంబశివం.... ప్రసూన వెంటనే ఒప్పుకుంది. తనవల్ల లలిత కోలుకుంటే అంతకంటే కావలసినదేముంది ?

దగ్గర దగ్గర వారం రోజులవరకు ప్రసూన లలిత మంచాన్ని వదల లేదు....లలిత "సుశీ !" అన్నప్పుడల్లా పలికేది .... వేళకు మందులిచ్చేది....ఏ రాత్రి వేళ లలిత "అబ్బా !" అనుకున్నా గభాలున లేచి కూచుని "ఏం కావాలమ్మా !" అనేది.

లలిత పరిస్థితి కొంచెం మెరుగు పడసాగింది. ఆ రోజు ప్రసూనను తేరిపార చూసింది....

"నువ్వు ఇక్కడ ఎందుకున్నావ్ ?" అంది....

ప్రసూన మాట్లాడ లేదు ....

"ఆయన నిన్ను ఏకంగా ఇంటికే తీసుకొచ్చాడా ?" అంది మళ్ళీ....

గతుక్కుమంది ప్రసూన....వెల వెల పోతూ చూసింది ....

"చూడు ! ఈ ఇల్లంతా నీ యిష్టం వచ్చినట్లు తిరుగు .... నా గదిలోకి మాత్రం రాకు !"

పురుగును విదిలిస్తున్నట్లుగా అంది లలిత........

ప్రసూన తల వంచుకొని ఆ గదిలోంచి వెళ్ళిపోయింది ....

సాంబశివం దగ్గరకొచ్చి "నేను వెళ్తున్నాను సార్ !" అంది.

"అదేం ? లలిత ఇప్పుడిప్పుడే కొంచెం కోలుకుంటోంది.... మరి కొన్ని రోజులు ఉండలేవూ ?"

"లలితగారు కోలుకుంటున్నారు....అందుకే నన్ను సహించలేకపోతున్నారు...."

సాంబశివం ముఖం పాలిపోయింది.

"సరే ! వెళ్ళు !"

ప్రసూనకు ఎలాగో అనిపించింది....తను చూపించిన ప్రేమ ప్రతిఫలం ఇది ! కనీసం ఒక థేంక్స్ అయినా లేకపోగా అవమానాలతో వెళ్ళవలసి వస్తోంది.

ప్రసూన వెళ్ళబోతుండగా పని మనిషి వచ్చి "అమ్మగారు మిమ్మల్ని పిలుస్తున్నారు" అంది....

ఒక్క క్షణం తటపటాయించి ప్రసూన లలిత గదిలోకి వెళ్ళింది....

లలిత చాలా నీరసంగా ఉంది కానీ ప్రమాద స్థితి దాటింది.

"అయామ్ సారీ ! ఈ వారం రోజులూ నా దగ్గిరున్నది నువ్వే నట కదూ !"

లలిత తనను ఈ మాత్రం గుర్తించటం ప్రసూనకు చాలా సంతోషాన్ని కలిగించింది.... చిరునవ్వుతో తన సంతృప్తిని సూచించింది.

"నీ సేవలో ఏదో ఆత్మీయత, అభిమానం ఫీలయ్యాను.... అందుకే సుశీల అని భ్రమపడగలిగాను.... ఇది నాకు ఆశ్చర్యంగా ఉంది...."

"ఆశ్చర్యమేముంది ? నా మనసులో ఉన్నది నేను చూపించుకోగలిగే అవకాశం వచ్చింది........"

"నీకు ఏదైనా బహుమనం ఇయ్యాలనుకుంటున్నాను .... ఏం కావాలో అడుగు...."

ఈ మాటలతో ప్రసూన ముఖంలో చిరునవ్వు ఎగిరిపోయింది.

" నా సేవలో ఏదో ఆత్మీయత కనిపించిందని మీరే అన్నారు. దాని మూల్యమెంతో మీరే నిర్ణయించి ఇవ్వండి...."

లలిత కొన్ని క్షణాలు ప్రసూన ముఖం చూస్తూ ఉండిపోయింది.

" వెళ్ళిరా ! నీ జీవితం సుఖంగా గడవాలని ఆశీర్వదిస్తున్నాను. "

ప్రసూన కోరుకుంటున్నది ఈ ఆశీర్వాదం కాదు.

"మీరు ఒప్పుకుంటే మరి కొన్ని రోజులు మీ దగ్గర ఉండాలని ఉంది. "

లలిత తల అడ్డంగా ఊపింది.

" వద్దు ! వెళ్లిపో !"

ప్రసూన మనసు దెబ్బతింది. వెళ్ళబోయింది. లలిత హీన స్వరంతో " నీకు ఏదైనా అవసరముంటే అడగడానికి భయపడకు" అంది.

ప్రసూన లలితకు అభిముఖురాలైంది.

" భయపడను. ఒకరిముందు చెయ్యిజూపడం మనను మనం చిన్నబుచ్చుకోవడం. మీ ముందు నన్ను నేను చిన్న బుచ్చుకోను. మీ కూతుర్ని నిజంగా ప్రేమించే స్నేహితు రాలిని నేను. ఈ విషయం మీరు నమ్మ గలిగితే చాలు !"

ప్రసూన కళ్ళు చెమ్మగిల్లటం లలిత గమనించింది.

తరువాత త్వరలోనే లలిత మంచంమీద నుంచి లేవగలిగింది. కానీ ఈ లలితకు వెనుకటి లలితకు పోలిక లేదు. గుర్తుపట్ట లేనంతగా మారిపోయింది.

ఆలోచించి ఆలోచించి లలిత ఒక నిర్ణయానికి వచ్చేసింది.

" నేను ఇంక మీ దగ్గర ఉండలేను-వెళ్ళిపోతాను-"

అంది సాంబశివంతో....

సాంబశివం ఆశ్చర్యపడలేదు- ఇలాంటిది ఎదుర్కోవలసి వస్తుందని అతను అనుకుంటూనే ఉన్నాడు.

ఏ విధంగానూ ఎవరికీ తోచని అపూర్వమైన స్త్రీమూర్తి లలిత .... ఇన్నాళ్ళుగా ఆవిడను సాధించటానికి తనకున్న ఒకే ఒక ఆయుధం సుశీల .... సుశీల లేదు. లలిత తనను క్షమించదు- దయ దలచదు-

" వెళ్ళు " అన్నాడు ప్రశాంతంగా....

క్రూర మృగంలా తన మీదకు కలియబడే సాంబశివం అంత శాంతంగా మాట్లాడటం లలితకు ఎలాగో అనిపించింది. అయినా ఇక అతనితో కలిసి తను ఉండలేదు.

" ఇన్నాళ్ళుగా మీ లాభాలలో సగం నా పేరుమీద ఉంచారు అది తీసుకోండి ! "

" ఉండనియ్యి ! "

" ఎందుకు నేను డబ్బుకోసం మిమ్మల్ని పెళ్ళి చేసుకున్నానని అనుకుంటున్నారా ? ''

" లేదులే ! నన్ను మోహించి ........" వెటకారంగా అన్నాడు.

" ఎంత మాత్రం లేదు. ఆరోజుల్లో మాకుటుంబంలో ప్రతి ఒకరూ నా పెళ్ళి ఒక సమస్య అన్నట్లు మాట్లాడే వారు. నా కుటుంబం కోసం పెళ్ళి చేసుకున్నాను. నేను ఎంత త్యాగం చేస్తున్నానో అర్థం చేసుకోకుండా చేసుకున్నాను గనుక ఇన్నాళ్ళుగా కట్టుబడి ఉన్నాను- మీడబ్బు మీరు తీసుకోండి ! "

" ఆ డబ్బు నీ పేరు మీదనే ఉండనియ్యి లలితా. నాకేదైనా అవసరమయితే నువ్వు నన్ను తప్పకుండా ఆదుకుంటావనే నమ్మకం నాకుంది- అందుకే నువ్వంటే నాకు గౌరవం- అందుకే నువ్వంటే నాకు ఈర్ష్య.... నీ గొప్పతనాన్ని చూసి ...."

నవ్వాడు సాంబశివం-

సాంబశివం ఇలా నిష్కపటంగా మాట్లాడినప్పుడు ఏమీ చెయ్యలేని అశక్తురాలయి పోతుంది లలిత- ఈ విషయం సాంబశివం కూడా అర్థంచేసుకున్నాడు.

కానీ లలిత అక్కడ కూర్చోలేక పోయింది- సాంబశివం చిట్ట చివరి ఆశాకిరణం కూడా హరించిపోయింది.

సాంబశివం రెండు రోజులు వరుసగా హోటల్‌కి రాలేదు. సాధారణంగా అలాజరగదు. కారణం ఏమిటో తెలుసుకోవడానికి హోటల్ సిబ్బంది ఎవ్వరికీ గుండె నిబ్బరంలేదు. రేఖ నవ్వుతూ "ప్రసూనా ! సాంబశివంగారి దగ్గర ఏదైనా మాట్లాడ గలిగే స్వాతంత్ర్యం నీకే ఉంది. నువ్వే కనుక్కోవా !" అంది.

రేఖ ఏ ఉద్దేశంతో అన్నా ఆమాటలు నిజమే అనిపించింది ప్రసూనకు. పైగా తను దొంగ నోట్లకు సంబంధించిన వివరాలు కనుక్కోవాలి. అందుకైనా వెళ్ళాలి-

ప్రసూన వెళ్ళేసరికి సాంబశివం తప్పతాగి ఉన్నాడు.

" ఎవరు ? " అన్నాడు ముద్ద ముద్దగా........

" సార్! " అంది ప్రసూన భయంగా....

" నువ్వా ! సుశీల వెళ్ళిపోయింది-లలిత వెళ్ళిపోయింది- అందరూ వెళ్ళిపోయారు.-" అన్నాడు-

లలిత వెళ్ళి పోయిన సంగతి ప్రసూన వింది- కానీ అందుకు సాంబశివం ఇంతగా కృంగిపోతాడనుకోలేదు- లలితను అంతగా ప్రేమిస్తున్నాడా?

" బాధ పడకండిసార్! "

" నాకు అన్నీ ఉన్నాయి-డబ్బుంది. హోదా ఉంది-పలుకుబడి ఉంది- కానీ, నా కెవరున్నారు? ఎవ్వరు లేరు........"

సింహం లాంటి సాంబశివం ఆడపిల్లకంటే అన్యాయంగా బేలగా అయిపోయాడు.

" అలా అనకండి సార్! మేమంతా లేమా ? "

"అవును ? అన్నట్లు నువ్వు ఉన్నావు కదూ! ఇవాళ నుంచి నాదగ్గరే ఉండిపోవాలి! చెప్పు. ఉంటావు కదూ! ఉంటావు కదూ!"

"ఉంటాను సార్!" అప్రయత్నంగా అనేసింది ప్రసూన....

" థ్యాంక్యూ వెరీమచ్! అమ్మాయి ! నువ్వున్నావు ! నాకు నువ్వున్నావు! "

అపురూపమైన పెన్నిధిని తలచుకొని ఆనందిస్తున్నట్లు అన్నాడు సాంబశివం-

తన మాటలకు తనే ఆశ్చర్యపోయింది ప్రసూన.

ఇదేమిటి ? సాంబశివంతో ఉంటానని తను ఎందుకు ఒప్పుకుంది ?

అతని స్థితిఎంతో దయనీయంగా ఉంది. అంతమాత్రం చేత తాను దయచూపించాలా? దయచూపించే పరిస్థితేనా ఇది? కాదు. దయలేదు. అంతకు మించిన శక్తి ఏదో తనను కదలించి వేస్తోంది. కఠినంగా ఉండటం తన వశంకాకుండా చేస్తోంది.

"నేను సంపాదించిందంతా సగం సుశీల పేరు మీదనే ఉంచాను. అదంతా శేఖర్ కుటుంబాన్ని విదేశాలకు తరలించటానికి ఉపయోగపడింది. మిగిలింది ఈ ఇల్లు. దీనికి నేను చెల్లించుకున్న మూల్యం ఎంతో తెలుసా ? సుశీల జీవితం ! నా జీవితంలో వెలుగు నా సుశీలను నేనే ఆహుతిచేసుకున్నాను. నా సుశీల నాకు మళ్ళీ వస్తుందా ? ఏదైనా ఇస్తాను. ఎంతైనా ఇస్తాను. నా సుశీలను మళ్ళీ నాకిస్తారా ఎవరైనా ?"

సాంబశివం అలా కుమిలిపోతోంటే చూడలేక పోయింది ప్రసూన. "బాధపడకండి!" అంటూ భుజంమీద చెయ్యి వేసింది. ఆ చేతిని ఆప్యాయంగా అందుకున్నాడు సాంబశివం.

"నన్ను వదలకు ప్రసూనా ! ప్లీజ్ నన్ను వదలకు ! నేను బ్రతకలేను." అన్నాడు మళ్ళీ ప్రాధేయపడుతూ.

"వదలను"

(సశేషం)



రాజధానిలోని ప్యారీలాల్ భవన్‌లో మార్చి 27న దక్షిణ భారత నటీనట సమాఖ్య, ఢిల్లీ కళాకారులు కలిసి "అతిథి దేవుళ్ళొస్తున్నారు జాగ్రత్త" అనే నాటకం ప్రదర్శించారు.

ఎడమనుండి కుడికి : డా॥ టి. జి. శాస్త్రి, శ్రీ నాగరాజరావు, శ్రీ ఎస్. నాగేశ్వరరావు, కుమారి శ్రీదేవి.

# పణిదం చేనేత సహకార ఉత్పత్తి, విక్రయ సంస్థ

గుంటూరు జిల్లా, సత్తెనపల్లి తాలూకాలో 'పణిదం' అనే కుగ్రామం. ఈ గ్రామ జనాభా సుమారు 2,500. అందులో సగం మంది హరిజనులే. యీ హరిజనులలో చాలామంది చేనేతపై ఆధారపడి జీవనము గడుపుచున్నారు. వీరే కాకుండా చేనేత కుల వృత్తిగా కలవారివి ఆ గ్రామంలో 150 కుటుంబాలు కలవు. ఆ గ్రామంలోని దాదాపు ప్రతి ఇంటిలోనూ కదరు ఆడిస్తూ నూలును వడకి, యీ చేనేత పారిశ్రామికులకు యిచ్చి తద్వారా ఖద్దరు బట్టలు, చేనేత బట్టలు నేయించుకొని ధరిస్తూ, విదేశీ వస్తువులను తగుల బెట్టెడివారు. అయినప్పటికిన్నీ యీ చేనేత పనివారలకు జీవన భృతి సరిపోయేదికాదు. వారికి వేరే వ్యాపకాలులేవు. సోదర భావంతో జాతీయ సహజీవనానికి అలవాటుపడి, ఆ రోజులలోనే అస్పృశ్యత పాటించకుండా హరిజనులతో కలసి, వ్యవసాయము తరువాత ముఖ్యవృత్తి అయిన చేనేతను సాగిస్తూ, రోజూ శ్రమించినా పొట్టకూటికి చాలక, పైగా ఇతర ప్రదేశాలలో చేనేత ఖద్దరు వస్త్రాలను అమ్ముకోవటానికి వీలులేకుండా తెల్లదొరతనం జులుంతో అడ్డుపడుతుండుటచేత వీరలు యమయాతనలు పడుతున్నప్పటికినీ, దేశం కోసం కష్టనష్టాలను భరించి జీవయాత్ర సాగిస్తూ వున్నారు. ఎట్టకేలకు బ్రిటిష్ ప్రభుత్వంవారు భారతదేశానికి స్వాతంత్ర్యము యివ్వటానికి అంగీకరించుటచేత యిచ్చటి తెల్లదొరతనం పరిపాలకులు నిర్బంధాలను సడలించారు. ఈ తరుణంలోనే సాంఘిక కార్యకర్త శ్రీ వంగర బ్రహ్మయ్యగారి నాయకత్వాన "అందరి కోసం ఒక్కరు—ఒక్కరికోసం అందరూ" అనే సహకార నినాదంపై పణిదం గ్రామంలోని మరియు దగ్గరలోనున్న లగడపాడు గ్రామానికి చెందిన చేనేత వృత్తిదారులు మరియు హరిజన చేనేత పారిశ్రామికులు 62 మంది సభ్యులతోనూ రు. 1240 షేరు ధనంతోను ఒక చేనేత సహకార సంస్థను ఉత్పత్తి మరియు విక్రయముల కోసం ఏర్పాటు చేసుకొని, తమ సంస్థను 21-12-1946 సం॥లో రిజిష్టరు గావించుకొని 2-1-1947 నుండి ఉత్పత్తిని ప్రారంభించింది. అప్పటి ఉమ్మడి మద్రాసు ప్రభుత్వం ద్వారా నూలును సంపాదించుకుంటూ చేనేత పరిశ్రమచేస్తూ ఆ రోజులలో సభ్యునికి దినసరి వేతనం 7 అణాల నుండి రు. 3 వరకు గడించి పెట్టింది. యిలా స్వరాష్ట్రం ఏర్పడే వరకు యీ సంస్థ తమ కార్యకలాపాలను మందకొడిగా సాగిస్తూనే యున్నది. ఆంధ్ర ప్రదేశ్ అవతరణ అనంతరం సహకార ఉద్యమం విరివిగా సాగించుటచేత 1967 ప్రాంతంలో చేనేత కార్మికులు పరిసర గ్రామాలకు చెందినవారు కూడా యీ సంస్థలో విరివిగా చేరటంవల్లనూ, తమకు అప్పట్లో వున్న భవనం చాలకపోవటం చేతను, చేనేత కార్మికులందరూ ఒకే భవనంలో పని చేసుకొనుటకు వీలులేకపోవటం చేతనూ, ఉత్పత్తి అయిన వస్తువులకు తగు మార్కెట్టు సంపాదించుటకున్నూ, వ్యాపారాభివృద్ధికి, రవాణా సౌకర్యాలకు అనువగు ప్రదేశంగాను వుండగలందులకు సత్తెనపల్లిలో సుమారు 500 ఎకరముల స్థలమును సంస్థకు సంపాదించి ముఖ్య కార్యాలయాన్ని, చేనేత కేంద్రాన్ని సత్తెనపల్లి వద్దకు పణిదం చేనేత సహకార ఉత్పత్తి మరియు విక్రయ సంస్థను తరలించారు. ప్రభుత్వంవారి సహాయంతోను, సంస్థ గడించిన లాభాలతోనూ స్వంత భవనాలు తమ సంస్థకు నిర్మించుకున్నారు. ఇతోధిక పారిశ్రామికాభివృద్ధి కావిస్తూ, వ్యాపారాభివృద్ధి చేసుకుంటూ ప్రస్తుతము 601 మంది సభ్యులతోనూ రు. 87677 షేరు ధనంతోనూ, రు. 1,73,684 రిజర్వు నిధులను సంపాదించుకొని వార్షికంగా సుమారు 17 లక్షల రూపాయల విలువగల వ్యాపారాన్ని కొనసాగిస్తూ, ప్రతి సంవత్సరం రెండు లక్షల రూపాయల వరకూ లాభం గడిస్తూ, స్త్రీ పురుషుల వివక్షతలేక రోజువార్ీ కూలీ రు. 12 యిస్తూ విదేశాలలో ముఖ్యంగా అమెరికా, జపాను, బ్రిటను మరియు మిలాన్ దేశాలలో మన దేశానికి ప్రత్యేకంగా మన ఆంధ్రులకు పేరు ప్రఖ్యాతులు సంతరిస్తూ, మన రాష్ట్రంలో సహకార రంగంలో విజయవంతంగా పనిచేస్తూ, రాయలసీమ ప్రాంతంలోని ఎమ్మిగనూరు సంస్థకు దీటుగా విరాజిల్లుతూంది. ఈ సహకార సంస్థ సత్తెనపల్లి తాలూకాలోని ఇరుకుపాలెం, గ్రంధశిరి, అబ్బూరు, నందిగం, అందుకూరు, మాదల, గుడిపూడి మరియు సత్తెనపల్లి గ్రామాలలోని చేనేత పారిశ్రామికులకు సేవచేస్తూ సహాయపడుచున్నది. ఈ సంస్థలో ఆసుపోయటం, కండెలు చుట్టటం, పగ్గంవేసి పోడుగు చేయటం, రంగుల అద్దకం, డిజైనులు ఏర్పరచటం, మెర్సి

**శ్రీ టి. తాతిరెడ్డి**



పణిదం సహకార సంస్థవారి గోడౌనులోని వస్త్ర ప్రదర్శనలో ఒకసమావేశం.

డైజింగ్ (తళుకు నునుపు చేయటం), టైలరింగ్ మొదలగు విభాగాలు పనిచేస్తూ యున్నవి.

ఈ సంస్థ పరిధిక్రిందనున్న 1200 మగ్గాలలో 543 మగ్గాలు యీ సంస్థకు స్వంతముగా యున్నవి. అందులో ఫ్రేము మగ్గాలు 183, ఫెడలు మగ్గాలు 4, యాంత్రిక మగ్గాలు 2, పవరు మగ్గాలు 16, మిగతావి గుంటమగ్గాలు. వీటితోపాటు ఒక హైడ్రో ఎక్స్ట్రాక్టరు (నీళ్ళు పిండేది), వార్పింగ్, డబ్బా వైండింగ్ మరియు పిరన్ వైండింగ్‌కు యంత్రసామగ్రి కలవు. యీ చేనేత సహకార సంస్థకు కావలసిన నూలును బొంబాయి, మధుర, కోయంబత్తూరు, మద్రాసు, గుంతకల్లు మరియు ఆదోని ప్రాంతాల నూలు మిల్లుల నుండి మరియు కావలసిన రంగులు, రసాయనాలు ICI బొంబాయి కంపెనీ నుండి తెప్పించుకొనుచున్నారు. ప్రస్తుతం నూలు విపరీత ధరలకు కొనవలసివస్తున్నది. ప్రస్తుతం ఈ సంస్థకు సత్తెనపల్లి, నర్సరావుపేట, పిడుగురాళ్ళ, పణిదం మొదలగు ప్రదేశాలలో విక్రయశాలలు గలవు. ఇప్పుడు సత్తెనపల్లిలోని ఈ సంస్థ ఆవరణలో విదేశాలకు ఎగుమతిచేసే రకముల వస్త్రాల నిల్వలకు మరియు ప్రదర్శనకు ఒక భవనం నిర్మాణం గావించబడుతూవున్నది. త్వరలో 'దాచేపల్లి'లోనూ జిల్లా కేంద్రమయిన గుంటూరులోనూ, రాష్ట్ర రాజధాని హైదరాబాదులోను విక్రయశాలలు ఏర్పడబోవుచున్నవి. ప్రస్తుతము ఈ సంస్థకు శ్రీ వంగర వెంకటేశ్వరరావు అధ్యక్షులుగా, 7 గురు డైరెక్టర్ల బోర్డు పనిచేయుచున్నది. డిపార్టుమెంటు తరపున. శ్రీ ఎస్. మధుసూదనరావుగారు డెవలప్‌మెంటు ఆఫీసరుగా, మేనేజరుగా పనిచేస్తూ యీ సంస్థను విజయవంతంగా నిర్వహిస్తున్నారు. ఇరువురు సాంకేతిక సహాయకులతోపాటు, 30 మందికి ఉద్యోగ అవకాశాలు కల్పించి, కార్యాలయాన్ని నిర్వహించుకుంటూవున్న యీ సంస్థ యితోధిక వస్తూత్పత్తిని గావిస్తూ దేశ ఆర్థిక సుస్థిరతకు చేయూత నొసంగి, స్వయం ఉపాధి కల్పన కల్పించుకుంటూ, తమలోనున్న హరిజన సభ్యులతో కలిసి అస్పృశ్యత పాటించక యీ సంస్థ అభివృద్ధికి సభ్యులందరూ పాటుపడుచున్నారు. ఇటువంటి ఆదర్శ సంస్థలో వివిధ రకాలయిన వస్త్రాలు, అనేక డిజైనులలోను, పెక్కు రంగులలోను తయారగుచున్న 2/20 నంబరు నుండి 2/100 నంబరు వరకు, బెడ్‌షీట్లు, దోమతెరలు, తువ్వాళ్ళు, చేతిరుమాళ్ళు, చొక్కాగుడ్డలు, 20" నెంబరు నుండి 100 నెంబరు వరకుగల ధోవతులు, చీరలు, లుంగీలు మొదలుగాగల వాటికి దేశ, విదేశాలలో బాగా ప్రశస్తం పొంది, ప్రాముఖ్యాన్ని సంతరించుకొని, విదేశ గిరాకీ (Demand) ని యీ సహకార చేనేత సంస్థ పొందియున్నది. త్వరలో యీ సహకార చేనేత సంస్థ తన సభ్యుల ప్రయోజనార్థం ఒక వయోజన విద్యా కేంద్రాన్ని, ఒక కుటుంబ నియంత్రణ శిబిరాన్ని ఏర్పాటు చేసుకొనబోవుచున్నారు. ఇప్పటికే వీరి మేనేజిమెంటుక్రింద ఒక ప్రాథమిక పాఠశాల సంస్థ స్వంత నిధులతో నిర్మించుకొన్న పక్కా పాఠశాల భవనంలో పనిచేస్తూయున్నది. ప్రస్తుతం ఈ సంస్థ సభ్యులు హరిజనులతోసహా ఒక కాలనీగా పూరిగుడిసెలు వేసుకొని ఒక్కొక్క గుడిసెలో 3 కుటుంబాల వరకు నివసిస్తూ వున్నారు. వీరందరకు ఒక కాలనీ ఏర్పరచి, గృహములు నిర్మించి, అన్ని వసతులు కలుగజేయవలసిన అవసరం ఎంతైనా యున్నది. వివిధ ప్రభుత్వ శాఖలు యీ బీద హరిజన చేనేత కార్మికులకు సహాయపడి వారిని, వారిసంస్థను యింకా ఉన్నతికి గొనిరావటానికి యిది మంచి తరుణం.



పణిదం చేనేత సహకార, ఉత్పత్తి సంస్థకు చెందిన పవర్‌లూమ్స్.

# ఆహార కల్తీ నిరోధక చట్టం

(గత సంచిక తరువాయి)

పబ్లిక్ ఎనలిస్టు నుంచి వచ్చిన నివేదిక యొక్క కాపీని పార్టీలందరకూ పంపాలి ప్రాధికారి. వారికి ఈ నివేదిక విషయంలో తమ దగ్గర తీసుకొన్న శాంపిలు నకు సంబంధం లేనిదిగా అనుమానం కలిగితే ప్రాధికారి దగ్గర నిలవ ఉంచిన మిగతా శాంపిలు పొట్లాలు లేదా సీసాలు కోర్టుకు తెప్పించి కేంద్ర ఆహార పరిశోధనాలయానికి పరిశీలన కోసం పంపవలసిందని ఎవరైనా దరఖాస్తు ద్వారా కోరవచ్చు. ఈ పరిశీలన నివేదిక ఒక నెల లోపల వచ్చెయ్యాలి అని కూడా శాసించటమయింది. పనులు ఆలస్యం చేయటానికి వీలులేదనే విషయం గమనీయం. కాని నివేదిక రాకపోతే మాత్రం మెజిస్ట్రేటు కేసు నడిపించటానికి వీలు లేదు.

అపమిశ్రితములు అని తీర్మానించబడ్డ ఆహారాన్ని విసర్జించి పారవేయవలసిందని ఉత్తరువు నిస్తారు. కేంద్ర ఆహార పరిశోధ నాలయ సంచాలకుడు పంపిన నివేదికకూ ఎనలిస్టు నివేదికకూ తేడా ఉన్నప్పుడు సంచాలకుని నివేదికయే గ్రహణీయము. అప్పుడు ఎనలిస్టు నివేదిక రద్దయినట్లే భావించాలి. సంచాలకుని నివేదిక ఉన్నప్పుడు ఇంకే క్రిమినలు కేసులో కూడా దానికి సంబంధించిన పరిశీలనా ప్రసంగం మళ్ళీ ఉండరాదు. అతడి నివేదిక లేనప్పుడు ఎనలిస్టు నివేదికను సాక్ష్యంగా క్రిమినలు కేసులో దాఖలు చేయ వచ్చు.

## శిక్షాకాండ

ఫలాని పాపం చేస్తే ఫలాని ఫలితం అనుభవించాలి అని చెప్పటం ధర్మ సంహితలో ఉంటుంది. ఫలితం అనుభవిస్తే అనుభవిస్తాంగాక. యీ పాపం ఇప్పుడు చేసేసి తీరాల్సిందే అనే తత్త్వం మాత్రం ధర్మంకాదు. పాపం చెయ్యటమే దిగజారి పోవటం. అదే ముమ్ముందుగా పాపికి వచ్చే ఫలితం. దిగజారి పోవటం అనేది శిక్ష కదా, అలాంటప్పుడు మరి ఈ శిక్ష ఎందుకు ఇంకా అని శంక. ఈ శిక్షవల్ల మళ్ళీ ఆ పాపం చెయ్యరాదు అని అతడికి అనిపించటమేగాక చూసేవాళ్ళకు ఈ పాపం చెయ్యటం అయ్యో—చాలా భయంకరమైన పరిణామం కలగటానికి మూలమవు తుంది అని తెలిసికోవటమే లక్ష్యం.

శిక్ష శారీరికమైంది. పాపం మానసికమైంది. ఫలాన పని పాపం అయినప్పుడు అది చేసిన క్షణాన, ఉన్నతిలో ఉన్న మనం దిగజారి పోయినామనుకోవటం, తక్షణ ఫలితం. ఈ మానసికమైన శాస్తి ధర్మశాస్త్రంలో ఉండేది. దిగజారిపోయినాం అనే బాధ తాము మానసికంగా గొప్ప స్థితిలో ఉన్నామని అనుభూతి చేసే వాళ్ళకే ఎక్కువగా అనుభూతి అవుతుంది. తాము దిగజారిపోతామే మోననే భయం వాళ్ళకే వుంటుంది గనక. తమ గొప్పతనంగాని మానవుడుగా తనకుగల వివేచనా ప్రాబల్యం విషయంగాని మనో బుద్ధుల్లో లేనివాడికి ఈ పాపం సంగతి తెలియటం అసంభవం. దాని ఫలితం సంగతి వట్టి కార్యకారణ సంబంధంగా మాత్రమే తెలు స్తుంది.

అతడికి మనసు ప్రధానం కాదు. మెటీరియల్ ప్రధానం. శరీరం ప్రధానం. తను పోగుచేసిన పదార్థాలు తనకు ప్రధానం. తన శరీరానికి కలిగే సుఖదుఃఖాలు మాత్రమే అతడికి విలువైనవి. అందుకనే అలాంటివారి శరీరాలకు శిక్షను వర్తింపజేయటం ఈ శిక్షాకాండ యొక్క అంతరాంతర లక్ష్యం. మిగతావాళ్ళకు లేదా అనద్దు. పతనమైన మిగతావాళ్ళకూ అన్వయిస్తుంది శాసనం.

ఇంతకూ ఇక్కడ శాసనంలో శారీరిక శిక్ష విషయం మాత్రమే ప్రస్తావించటం జరుగుతుంది. మానసికమైన శిక్ష ఎవరికివారు బుద్ధిచేత యోచించి విధించుకొంటేనేగాని కలగదు. అందుకని, అది శాసనంలో ఉండే అవకాశంలేదు. కాని ఈ శారీ రిక శిక్ష విధించటమనేది నేరస్థుడి మనస్తత్వాన్ని సాధ్యమైనంత వరకు గ్రహించిన మెజిస్ట్రేటు చేయవలసినపని. మనసులోని

శ్రీ కామరాజుగడ్డ రామచంద్రరావు

ఆంతర్యం పరమపాపభూయిష్టమైతే వారికి పెద్ద శిక్ష, కొంత తక్కువ రకమైన నేరానికి తక్కువ శిక్ష వేయాలి. అలా మెజి స్ట్రేటు ప్రవర్తించటానికి సూచనలు యీ శాసనాల్లో యేర్పాటు చేస్తారు. ఈ శాసనాలు ఆధారంగా న్యాయాన్ని ప్రకాసించాల్సిన వాళ్ళు—అందుకనే—మెజిస్ట్రేటులూ, జడ్జీలున్నూ.

శరీరారోగ్యాన్ని భంగపరచే విషాత్మకమైన పదార్థమయి నట్లయితే—అది ఉంచిన పాత్ర, లేదా బంగీలో విషపూరితమైన వాతావరణమున్నట్లయితే—బాగా అందంగా వుండాలనే ఉద్దేశంతో వేసిన రంగు విహితమైనదానికంటె ఎక్కువ వేసినందువల్ల శరీరా రోగ్యం ఆ తిన్నవాడికి చెడిపోయే పరిస్థితి ఉంటే—ఈ చట్టంక్రింద చేసిన నియమాలక్రింద నిషేధింపబడిన వస్తువులు ఉపయోగించి లేదా అనుమతించబడని అనుపాతంలో వాడినట్లయితే—ఇవన్నీ పరమహానికరమైనవే గనక దాన్ని తయారుచేసినవాని నేరము చాలా పెద్దదని లెక్క. కనుక శిక్ష పెద్దదై ఉండాలి.

ఇలాటి పదార్థాలు ఎక్కడినుంచో దిగుమతి చేసుకొన్నా, అమ్మినా, పంపకం చేసినా అలాంటి శిక్షే ఇవ్వాలి. అంతేగాక ఒక పదార్థానికి యింకో ముద్రవేసి అమ్ముతారు. తగని ముద్రవేసి అమ్మినప్పుడు అది తెలియక ఆరగించినవారి శరీరారోగ్యం దెబ్బ తినేటట్లయితే అది పెద్ద నేరమే.

ఇలాటి పెద్ద నేరాలు చేసినవాళ్ళకు ఒక సంవత్సరం కారాగార వాసానికి తక్కువ కారాగారవాసం వెయ్యటానికి వీలులేదు. ఆరు

సంవత్సరాల శిక్షవరకూ వేయవచ్చు కూడా. జుల్మానా రెండు వేల రూపాయలకు తక్కువ ఉండరాదు అనే అంశ 16 (1-ఎ) సెక్షనులో ఉంది. పైగా అలాటి పదార్థం తింటే శరీర స్వాస్థ్యం తప్పటమేగాక ఒకప్పుడు "చావు" కూడా ప్రాప్తించే అవకాశం ఉంటుంది. అలాటి విషపదార్థమది అయినప్పుడు శిక్ష జీవితాంత కారాగారవాస శిక్షవరకూ ఉండవచ్చు. పైగా మూడు సంవత్సరాల కారాగారవాసానికి తక్కువ కాకుండా శిక్షవేసి తీరాలి. పైగా ఐదు వేల రూపాయల జుల్మానాకు తక్కువకాని జుల్మానా వేయాలి.

## చిన్న నేరాలకు చిన్న శిక్ష

పై చెప్పిన నేరాల్లో ఆ పదార్థంలో కలిసిన మిశ్రణం వల్లగాని చెడువల్లగాని ఆ తిన్నవాని ఆరోగ్యం భంగంకాదనీ, కాని కల్తీ మాత్రం జరిగిందనీ చెప్పగల పరిస్థితుల్లో నేరం కొంత చిన్నదిగా భావింపబడుతుంది.

ఆ మిశ్రిత ఆహారంలో యే యే పదార్థాలు ప్రభుత్వం నియమాలు చేసి, విహితం చేసినట్లుగా ఎంత ఎంత ఉండాలో అంత ఉండకుండా ఎక్కువ తక్కువలు వున్నట్లయితే అది నేరమే అవుతుంది. తగని ముద్ర వేసి అమ్మటం కూడ యథాతథంగా నేరమే. ఈ చట్టం క్రింద అధికారులిచ్చిన ఉత్తరువులకు వ్యతిరేకంగా పనులు చేసినట్లయితే అదీ నేరమే. ఉదాహరణకు ఆహార పరిశీలకాధికారిని శాంపిలు తీసుకోనియ్యకుండా చేయటం, ఆహారం ఉత్పత్తిచేస్తూ దానిలో కలిపేందుకు వీలయిన అపమిశ్రణాన్ని దగ్గర ఉంచుకోవటం కేంద్ర ఆహార పరిశోధనా సంచాలకుడు ఇచ్చిన సర్టిఫికెటునుగాని పబ్లికు ఎనలిస్టు నివేదికనుగాని ఆహారపదార్థాల అమ్మకానికి ప్రకటన చేసేందుకు ఉపయోగించటం – వంటివన్నీ నేరాలే.

ఇలాటి నేరాలకు ఆరు నెలలకు తక్కువకాని కారాగారవాసం విధించి తీరాలి. మూడేండ్లవరకు పోవచ్చు శిక్ష. 500 తక్కువ కాని జుల్మానా విధించాలి. ఇంకా ఎక్కువే వేయవచ్చు కూడా.

లైసెన్సు లేనిదే కొన్ని ఆహార పదార్థాల తయారీ చేయటం గాని అమ్మకం చేయటంగాని కూడదు. అలాచేస్తే అది నేరం. లైసెన్సులు కొన్ని కేంద్ర ప్రభుత్వం చేసిన నియమాల క్రింద అవసరమై ఉంటయి. కొన్ని రాష్ట్ర ప్రభుత్వం చేసిన నియమాల క్రింద అవసరమై ఉంటయి. ఏది పాటించకపోయినా నేరమే. "తగని ముద్ర వేసిన ఆహారం" అనే పదబంధంలో అనేక రకాల అర్థాలున్నాయి.

మోసం చేయటానికి వీలుగా ఏదో పదార్థంలాగా తయారు చేసి ఇంకో పదార్థాన్ని చూపెట్టి పైన ముద్ర వేయకనో తప్పుగా వేసో అలా చేయటం, ఫలాని దేశానికి చెందింది అని అబద్ధం చెప్పటం, ఇంకో పదార్థానికి దేనికో చెందిన ఆహారమేనని మరోదానికి పేరు పెట్టి అమ్మటం, మేడిపండు వంటి పూతలు పూసి అమ్మటం పదార్థంలో వున్న వివిధ మూల పదార్థాలు ఏవేవి ఏలాటి నిష్పత్తిలో వున్నాయో పై పేకేజి మీద వ్రాయకపోవటం, ప్రత్యేకంగా ఆహార నియమంలో ఉన్నవాళ్ళు ఉపయోగించే ఆహారమైనప్పుడు విహితం చేయబడిన నిష్పత్తిలో విటమినులు లేకుండా తయారుచేసినట్లయితే ఇవన్నీ కూడ తగని ముద్ర వేయబడిన ఆహారాలను అమ్మిన లేదా అమ్మజూపిన నేరం క్రిందికి వస్తవి. ఈ నేరాల్లో ఆ ఆహారం తిన్నవాళ్ళ ఆరోగ్యం ఈ కల్తీ మూలంగా చెడిపోయే స్థితి లేకపోయినట్లయితే శిక్ష కొంత తక్కువ. అయితే మూడు నెలల కారాగారవాస శిక్ష మాత్రము తప్పనిసరి అయి ఉంటుంది. కనీస జుల్మానా రు.500 మాత్రమే.

ఆహార పరిశీలకాధికారి ఆహారాన్ని పట్టుకొని తిరిగి దుకాణదారు వద్దనే ఉంచి మళ్ళీ చెప్పేవరకు అలా జాగ్రత్తగా ఉంచమని 10వ సెక్షను క్రింద అనవచ్చు. అలాటప్పుడు ఆ ఆహారాన్ని మార్పుచేసినట్లయితే దానిని అమ్మినట్లయితే కనీసం ఆరు నెల్ల కారాగారవాస శిక్ష. అలా అమ్మినప్పుడు ఆ ఆహారంలోని కల్తీవల్ల వ్యక్తి చనిపోయేటంతటి అవకాశం ఉన్న కల్తీ అయినట్లయితే మూడేళ్ళకు తక్కువకాని కారావాస శిక్షఉంది.

## విచిత్రమైన శిక్ష

ఉత్పత్తిదారు సరుకు ఇచ్చేటప్పుడు గారంటీ కానేవాడికి ఇవ్వకపోతే శిక్ష. తనకు ఎవరెవరి దగ్గర నుంచి ఆ పదార్థం వచ్చిందో అధికారిఅడిగినప్పుడు చెప్పకపోతే శిక్ష. ఒకసారి శిక్షపడి మళ్ళీ అలాంటిపనే తిరిగి చేసినట్లయితే లైసెన్సు రద్దు చేయటం ఒక శిక్ష.

ఇంకొక చిత్రమైన శిక్ష ఉంది. రెండు సార్లు శిక్షకు పాత్రుడయినవాని-ఊరు విషయం-వ్యాపకం-శిక్ష అన్నీ కూడా పేపర్లలో ప్రకటించి ప్రపంచానికి అతడి అధమతమమైన మన స్తత్వాన్ని విశదపరచటం కూడ శిక్షే. ఈ శిక్ష విషయంలో విశేషం ఏమిటంటే పేపర్లలో ప్రకటనకు అయే ఖర్చు కూడ ఆ అపరాధే భరించాలి.

## శిక్షల ఆశయం

ఇంత దూరం ఎందుకు ఏర్పాటు చేశారంటే అది సమాజంలో ఉన్న నమ్మకం అనాలి. అందుకే సమాజానికి వ్యక్తుల అవుకు తెలియ జెప్పటం పెద్ద శిక్షగా గమనించారు.

వ్యక్తులు సమాజంలోనివారు. సమాజానికి ప్రతిపత్తి ఉంది. దాని చెలాయింపులో వ్యక్తిహక్కులు అడ్డం రాకూడదు. అందుకే సమాజం వ్యక్తిచేసిన తప్పులకు శాసనపూర్వకంగా శిక్షనిస్తుంది. అయితే ఈ శిక్ష వివేచనారహితంగా-నిరంకుశత్వంతో-విధింపటం శాసనం యొక్క లక్ష్యం కాదు. ఎవరెవరి మనస్తత్వం ఎంతెంత వరకుఅడుక్కుదిగజారిపోయిందో గమనించి అంతమేర శిక్ష నివ్వాలనే నీతి సూత్రం ప్రాతిపదికగా శాసనం చేయబడుతుందనే విషయం గమనీయం.

ఫలాని తప్పుడు పనిచేస్తే కొన్ని వేల రూపాయలు లాభం వస్తుంది పట్టుబడితే జరిమానా ఎంత? అని విచారించి ఆ జరిమానా ఇచ్చినా ఇంకా లాభం మిగులు వుంటుంది గదా అనుకొనే వాడికి నైతిక పతనం యొక్క విలువ సున్న. అతడు దేశానికి అసురుడి వంటివాడు. అతడిని కోర్టు కెక్కించి కారాగారవాసానికి దింపటం తప్పనిసరి అనేది పౌరులు తెలిసికోవటం,- అది ఒక ఎడ్యుకేషన్!

(సశేషం)

సీరియల్ :

# మహాభారతము

శ్రీ కప్పగంతుల లక్ష్మణశాస్త్రి

"జనమే జయా! సైరంధ్రి సుదేష్ణకు ఇట్లు చెప్పి, దుఃఖ మోహితురాలై కీచకుని వధకొరకు దీక్షపూనెను. అంతఃపురస్త్రీలు సుదేష్ణాదేవి ఎంత ప్రార్థించినను ద్రౌపది స్నానముగాని భోజనము గాని చేయలేదు. తుదకు ఒడలికి అంటిన దుమ్ము గూడ దులుపలేదు. ఆమె ముఖము నెత్తుటదడిసియుండెను. కన్నుల అశ్రులు రాలు చుండెను. అట్లు దీక్ష పట్టిన సైరంధ్రిని అంతఃపురస్త్రీలు చూచి, తమ మనస్సులలో కీచకవధను ప్రశంసించిరి." ఆకథ విని జనమే జయుడు వైశంపాయనునితో నిట్లనెను:

"మునివరా? లోకోత్తర పతివ్రతయైన ద్రౌపదిని కీచకాధముడు కాలితో తన్నెను. ఆమె దుఃఖముతో నెంత కష్టమననుభవించెను. అయ్యో! సైంధవుడు తనను బలాత్కరించినను ఆమె తన భర్తలకు సోదరియైన దుశ్శలకు వైధవ్యము రాగూడదని సైంధవుని శపించలేదు. అదిసరియేకాని, దురాత్ముడైన కీచకుడు తన్నినను నతనినేల శపించలేదు? అంతటి తేజోరాశి, ధర్మజ్ఞురాలు, సత్యవాదినియైన ద్రౌపది, తన కేశములుపట్టియీడ్చిన కీచకాధముని అసమర్థురాలువలె ఎందుకు సహించియూరకుండెను? ఇందుకు సామాన్య కారణము ఉండదు. ఆకారణమును తెలుపుము. ద్రౌపదికి కలిగిన క్లేశమును విని నామనస్సు పరితపించుచున్నది. విరాటరాజు నకు మరదియైన యా దుష్ట కీచకుడెవరి వంశము నందు పుట్టెను? బలోన్మత్తుడెట్లయ్యెను?" ఆ మాటలకు వైశంపాయనుడిట్లనెను:

## కీచకుని జన్మవృత్తాంతము

"రాజా! బ్రాహ్మణ స్త్రీ యందు క్షత్రియునకు పుట్టినవాడు 'సూతుడు' అనబడును. ప్రతిలోమ సంకర జాతిలో పుట్టిన వారిలో ఈ సూత జాతి యొక్కటి మాత్రమే 'ద్విజ' జాతియనబడును. రాజా! పూర్వ రాజులు కొందరు ఈ సూతజాతితో వైవాహిక సంబంధము కలిగి యున్నారు. కాని వారికి 'రాజ' బిరుదము రాదు. ద్విజోచితములైన కర్మలు గల ఆసూతునే 'రథకార' నామముతో పిలిచిరి. సూతుడు, జాతిలో క్షత్రియుని కన్న తక్కువ, వైశ్యుని కన్న తక్కువ యని తలచబడుచుండెను. వారికొరకు 'సూత రాజ్యము' అను పేరుతో నొక రాజ్యమే యేర్పరుపబడెను. ఆ రాజ్యము నొక సూత జాతివాడు ఒక క్షత్రియుని సేవ చేసి సంపా దించెను.

"సూతజాతి వారికి రాజుగా 'కేకయుడు' అను రాజు ఉండెను. అతడొక క్షత్రియ స్త్రీ గర్భమునుండి పుట్టెను. రథ సారథ్య కార్యమునందతడు కుశలుడై యుండెను. అతనికి 'మాలవి' గర్భమునుండి అనేక పుత్రులు పుట్టిరి. రాజా! ఆ పుత్రులలో కీచకుడు జ్యేష్ఠుడు. అతడు అతిబలవంతుడు. అందరిని జయించువాడు. కేకయ రాజు రెండవ భార్య గూడ మాలవ పుత్రి 'మాలవి' యే. ఆమె గర్భము నుండి 'చిత్ర' అను కన్యక పుట్టెను. ఆమెయే 'సుదేష్ణ' యని పిలువబడుచుండెను. ఆమె విరాట రాజు పట్టపుదేవి. విరాటరాజు మొదటి భార్య కోసలరాజ పుత్రి 'సురథ' యను నామె 'శ్వేతుడు' అను కొడుకును కని మరణించిన తరువాత కేకయుడు సుదేష్ణను విరాటున కిచ్చి పెండ్లి చేసెను. సుదేష్ణను పెండ్లాడిన తరువాత విరాటరాజు భార్యా దుఃఖ మును పోగొట్టుకొనెను. సుదేష్ణకు 'ఉత్తరుడు' అను కొడుకు, 'ఉత్తర' అను కూతురు జనించిరి.

"కీచకుడు తన పినతల్లి కూతురగు సుదేష్ణను సేవించుచు సర్వదా విరాట నగరమునందే సుఖముగా నుండెను. పరాక్రమ శాలురైన కీచకుని తమ్ములు గూడ కీచకుని సేవించుచు, విరాట రాజు సైన్యమును, ధనాగారమును పెంచుచు సంతోషముతో విరాట నగరమునందే యుండిరి.

"రాజా! ప్రపంచ విఖ్యాతులైన 'కాలేయులు' అను రాక్షసులే కీచకులుగా పుట్టిరి. వారిలో 'బాణుడు' జ్యేష్ఠుడు. అతడే సర్వాస్త్ర సంపన్నుడై, బలశాలియై, భయంకర పరాక్రమ సంపన్నుడై, మను ష్యులకు భయావహుడై, ధర్మము యొక్క హద్దును మీరి నడచు చున్న కీచకుడని తెలిసికొనుము. బలోన్మత్తుడైన ఆ కీచకుని సహాయముతోనే విరాటరాజు, ఇంద్రుడు రాక్షసులనువలె, సమస్త శత్రువులను జయించెను. "మేఖల-త్రిగర్త-దశార్ణ-కశేరుక-మాలవ యవన-పులింద-కాశి-కోసల-అంగ-వంగ- కళింగ-తంగణ- పర తంగణ-మలద- నిషధ- తుండికేర- కోంకణ-కరద-నిషిద్ధ- శివ- దుశ్శిలిక" దేశాధిపతులేకాక శూరులైన ఇతర దేశ రాజులుగూడ ననేకులు కీచకునికి ఓడి పారిపోయిరి.

"జనమేజయా! పదివేల యేనుగుల బలము గలిగి పరాక్రమ వంతుడైన కీచకుని విరాటరాజు తనకు సేనాధిపతిగా నియమించెను.

విరాటరాజుయొక్క సోదరులు పదుగురు దశరథరామునితో సమాన మైన బలపరాక్రమములు గలవారుగూడ, తమకంటె అధిక బల సంపదగల కీచకులనే అనుసరించి నడచుకొనుచుండిరి.

"ఇటువంటి అసమాన బలపరాక్రమ సంపన్నులు, రాజునకు శ్యాలకులునైన కీచకులు విరాటుని హితముకోరువారుగా నుండిరి. జనమేజయా! కీచకుని పరాక్రమమునుగూర్చి నీకు చెప్పితిని. ద్రౌపది యాతని నెందుకు శపించలేదనగా, సాధారణముగా లోకమునందు ఋషులు, తమ తపస్సు కోపమువలన నశించునని శపించరు. ఆ వాస్తవమును తెలిసినది కనుక ద్రౌపది కీచకుని శపించలేదు. ఓర్పు గలవారికి అన్నియు సిద్ధించును. ఇహపర సౌఖ్యములు లభించునని తెలిసినదికనుక ద్రౌపది అప్పుడు ఓర్పు వహించి కీచకుని శపించ లేదు. ఇదిగాక, తన భర్తలు ధర్మపరులు, క్షమావంతులు గనుక వారి యభిప్రాయము ననుసరించి తాను శపించుటకు సమర్థురాలె యుండియు కీచకుని శపించలేదు. :

"పాండవులు గూడ ద్రౌపదినిచూచి దుఃఖితులైయుండియు. కాలమునకై యెదిరి చూచుచు, మనస్సులోపలనే క్రోధాగ్నిచేత దహింపబడుచుండిరి. భీముడు కీచకుని వధించుటకు, ఉద్యుక్తుడయ్యు, మహోదధి పొంగును. తీరము వారించినట్లు ధర్మపుత్రుడు వారించగా నప్పటికి ఊరకొనెను. కాని, ఆ రోషమును మనస్సులో అణచుకొని రాత్రింబవళ్లు నిట్టూర్పుచు, అతి కష్టముతో ఆ రాత్రి వంటయింటిలో నిద్రించెను." ఇట్లు చెప్పి వైశంపాయనుడుతరువాతి కథ చెప్పుటకు ఉపక్రమించెను.

## ద్రౌపది భీమునివద్దకు పోవుట

"జనమేజయా! కీచకునితో దెబ్బ తినినది మొదలు ద్రౌపది కీచకుని వధించు విషయమునే సర్వదా యోచించుచుండెను. రాజ సభనుండి తన నివాస స్థానమునకు పోయి వస్త్రములు ఉదుకుకొని, స్నానాదులుచేసి పరిశుభ్రురాలయి తనకు సంభవించిన దుఃఖమునకు ప్రతీకారమును యోచించుచు దుఃఖముతో నుండెను. 'నేనెక్కడికి పోవుదును? ఏమి చేయుదును? నాపని యెట్లు నెరవేరగలదు?' అని మనస్సులో భీముని స్మరించుకొని భీముడు తప్ప మరియొక డిప్పుడు నా మనస్సుకు ప్రీతి గలిగించువాడులేడు? అని నిశ్చయించు కొని, లేచి అక్కడినుండి నేరుగా భీముని కడకు త్వరగా పోయి, భీమునితో 'నా శ్శత్రువైన ఆ సేనాపతి పాపిష్ఠుడు నన్ను అంతగా అవమానపరచినగ్గూడ నేను జీవించియుండగా, నీవు సుఖముగా ఎట్లు నిద్రపోవుచున్నావు' అని యనుచు భీముని నివాసమునందు ప్రవేశించెను. అప్పుడతడు సింహమువలె నిట్టూర్పుచు సుఖముగా నిద్రించుచుండెను.

"జనమేజయా ! ద్రౌపదియొక్క దివ్యరూపముతో భీమసేనుని పాకశాల ప్రకాశించెను. శ్వేతవర్ణముగలిగి నీటియందు పుట్టిన పెంటికొంగ పోతుకొంగ వద్దకు పోయినట్లును, తోటయందు పుట్టిన తెల్లని గోవు కోడె వద్దకు పోవునట్లును, అడవిలో పుట్టిన కరిణి గజమువద్దకు పోయినట్లును, ద్రౌపది భీమసేనుని వద్దకు పోయెను. ఆమె గోమతీ తీరమునందు పుట్టి వికసించిన పెద్ద మద్ది చెట్టును లతవలె మధ్యమ పాండవుడైన భీముని, (ఇక్కడ భీముని మధ్యమ పాండవుడని పేర్కొనినాడు కవి. దీనికి కారణము, విరాట నగరమునందు మధ్యమ పాండవుడైన అర్జునుడు వ్యక్తిత్వములేని బృహన్నలగానున్నందుచేత, అతనిని పంచపాండవుల లెక్కలోనికి తీసికొనక భీముడు రెండవ పాండవుడైనను అతనికే మధ్యమ పాండవుడని పేరుపెట్టినాడు మహాకవి వ్యాసభాగవానుడు.), దుర్గమమైన అడవి యందు నిద్రించియున్న సింహమును సింహము వలెను, గజమును కరిణివలెను, ఆలింగనముచేసికొని, వీణానాదము వంటి మధురమైన కంఠధ్వనితో "భీమసేనా ! లెమ్ము! లెమ్ము! మృత్యువువలె ఎందుకు నిద్రించుచున్నావు ? నీవంటి వీరుడు జీవించియుండగా అతని భార్యను తాకిన పాపిష్ఠుడు జీవించియుండ జాలడు " అని యనెను.

"అప్పుడు మేలుకొని నీలమేఘచ్ఛాయగల భీమసేనుడు శయనమునుండి లేచి ద్రౌపదితో 'రాజపుత్రీ! ఏమిపనియుండి యింత తొందరపాటుతో నాకడకు వచ్చితివి? నీ శరీరకాంతి అస్వాభావికముగా నున్నది. పూర్తిగా నాకు తెలియునట్లు సమాచారమంతయు చెప్పుము. నీకు గలిగిన సుఖదుఃఖములు గాని ప్రియా ప్రియములు గాని ఉన్నదున్నట్లు చెప్పుము. నేను తెలిసికొని తగిన ఉపాయమును యోచించెదను, ద్రౌపదీ ! అన్ని పనులు నీకు నెరవేర్చుటయందు నేనే కదా విశ్వాస పాత్రుడను. నీకు ఆపద కలిగినప్పుడు నేనే కదా మాటిమాటికి నిన్ను కాపాడు చున్నాను. నీవు చెప్పదలచిన పని యేదో స్వేచ్ఛగా, త్వరగా చెప్పి, నీవు యితరులు నిన్ను కనిపెట్టకుండునట్లుగా నీ శయనా గారమునకు పొమ్ము' అని చెప్పెను.

"జనమేజయా ! ద్రౌపది భీముని మాటలు విని సిగ్గు చెందుచు భయపడి అధోముఖియై అశ్రువులు రాల్చుచు నిలుచుండెనే కాని యే మాటయు బదులు చెప్పజాలక పోయెను. అది చూచి భీముడు 'సుందరీ! నీకు ఏమి ప్రియము చేయవలయునో సందేహించక చెప్పుము' అని మరల అడిగెను. అప్పుడు ద్రౌపది యతనితో నిట్లనెను:-

" ఏ స్త్రీ యొక్క భర్త యుధిష్ఠిరుడో, ఆస్త్రీ శోకింపకుండ ఎట్లుండ గలదు ? నాకు గలిగిన అన్ని దు ఖములను ఎరిగిన వాడవై కూడ నీవునన్నెందుకు అడుగుచున్నావు? ఆనాడు దుశ్శాసనుడు నన్ను దాసీ! యని యనుచు కౌరవ సభలోకి మహా పురుషుల సమాజములో యీడ్చుకొని వచ్చినప్పటి అవమానము ఈనాటి వరకు నన్ను దహించుచున్నది. క్షత్రియులు, కర్ణాదులు, దుర్యోధనుడు, అత్త మామలైన గాంధారీ ధృతరాష్ట్రులు, భీష్మ ద్రోణ కృప విదురాదులు చూచుచుండగా సభలో దుశ్శాసనుడు అత్త మామల మధ్య, కొప్పుపట్టుకొని, నీవు బ్రతికియుండగానే, సభలోనికి ఈడ్చి అవ మానపరచెను గదా! అటువంటి దుఃఖమును అనుభవించిన నావంటి రాజపుత్రి మరియొకతె యెట్లు సహించును? ఆ యవమానము ఈ ద్రౌపదికి మాత్రమే ఆనాడు సహించియుండవలసిన దుర్గతి పట్టినది. వనవాసమునందు గూడ దురాత్ముడైన సైంధవుడు నన్ను ఆక్రమించి స్పృశించెనుగదా ! అది నాకు గలిగిన రెండవ అవమానము. దానిని ఎవతె సహించును?

"పాండవోత్తమా! నీవు జీవించియుండగనే, నేను దుర్గమారణ్య ప్రాంతములలో కాలినడకన నడువవలసివచ్చెనే! వనమునందు పన్నెండేండ్లు కష్టములనుభవించి పదుమూడవయేట ఈ పట్టణమునకు వచ్చి, పరస్త్రీయైన సుదేష్ణకు పరిచారికగా ఉన్నాను. సత్య-ధర్మమార్గములందు నడచుచున్న నేను పరస్త్రీకి ఊడిగము చేయుచున్నానే! ప్రతిదినము విరాటరాజు కొరకు, హరిచందనము, పద్మకము, హరిశ్యామము, అను నోషధులనుండి గంధము నూరుచున్నాను. పాండునందనా! నీవు జీవించియుండగానే యీ కష్టములన్నియు అనుభవించవలసిన దుర్గతి నాకు పట్టినది. ఎన్ని కష్టములని లెక్కపెట్టి చెప్పుదును? అన్నియు నీవు ఎరిగినవేకదా! ద్రుపదుని కూతురునై ధృష్టద్యుమ్నుని చెల్లెలినై, యజ్ఞమునందు అగ్నికుండము నుండి పుట్టినదాననై మిక్కిలి గారాబముతో, నేలపైన కాలూనకుండ పెరిగిన నాకు ఈ కష్టములు సంప్రాప్తించినవి.

"విరాటరాజు సభలో, ఆ దుష్టరాజు చూచుచుండగనే కీచకుడు స్పృశించెను. నా వంటిది మరియొకతె ఆ యవమానమునకు జీవించునా? ఈ నా కష్టములు నీకు తెలియకున్నవా? ఇక నేను జీవించుటచేత ఫలమేమి? ఆ దుష్టకీచకుడు 'నాకు భార్యవు కమ్మ' అని ప్రతిదినము బాధించుచున్నాడు. శత్రుదమనా! ఇట్టి అవమాన వాక్యములు ప్రతి దినము వినుచు, పంటకాలమునందు పరిపక్వమైన పండువలె నా హృదయము చీలుచున్నది. వీరుడా! నీ క్రోధము, బలము, వీర్యము నాకు బాగుగా తెలియును గాబట్టి నీ యెదుట మొరపెట్టుకొనుచున్నాను. పురుషసింహమా! అరువదియేండ్లయీడు గల మదపుటేనుగు, నేలపైన బడిన బిల్వ (మారేడు) ఫలమును కాలితో అదిమి నలిపివేసినట్లే నీవుగూడ, ఆ నీచకీచకుని శిరస్సు భూమిపై పడవేసి యెడమకాలితో త్రొక్కుము. ఆ దురాత్ముడు రేపు తెల్లవారి సూర్యోదయము వరకు జీవించియుండినచో నేను జీవించియుండజాలను.

"దుష్టద్యూతమును ఆడుచున్న నీ యన్నను నిందించుము. అతని వలననే కదా ఎడతెగని దుఃఖములు సంప్రాప్తించినవి. ద్యూత వ్యసనము గలవాడు తప్ప మరియెవడు జూదమునందు రాజ్యమును, సర్వస్వమును, తుదకు తనను కూడా ఓడి పోయి వనవాసమున పందెముగా బెట్టి యీ దుర్గతికి పాల్పడును? ప్రతిదినము, ప్రాతఃకాల సాయంకాలములందు వేయి వేయి బంగారు నాణెములను పందెము పెట్టి అనేక సంవత్సరములు ధర్మరాజు జూదమాడినప్పటికిని, ఒక్కసారిగా అంతయు పోగొట్టికొని యుండడు, జూదపు వ్యసనము చేతనే అతడు రాజ్యసింహాసనమునుండి భ్రష్టుడయ్యెను. అన్నియు పోగొట్టుకొని యిప్పుడు మూర్ఖు తన కర్మమును గూర్చి చింతించుచు ఊరకున్నాడు.

"ఏ మహారాజు బయలు వెడలినప్పుడు పదివేల యేనుగులు సువర్ణహారములచే నలంకరింప బడిన వేలకొలది అశ్వములు, వెనుకనడుచుచుండెనో, అట్టియుధిష్ఠిరుడు జూదముచేత తనజీవికను గడుపుకొను చున్నాడు. ఇంద్రప్రస్థనగరమునందు ఏ రాజు బయలు వెడలినప్పుడు లక్షరథములు, అధిక పరాక్రమవంతులైన అనేక రాజులు ఉపాసించుచు వెనుక వెడలు చుండిరో, ఏ మహారాజు యొక్క లక్ష దాసీజనము ప్రతిదినము బంగారు పాత్రములతో రాత్రింబగళ్లు అతిథులకు భోజనము వడ్డించుచుండిరో, ఏరాజు ప్రతిదినము వేలకొలది బంగారునాణెములను దానముగ నిచ్చుచుండెనో, అట్టి మహారాజు యుధిష్ఠిరుడు నేడు జూదమునందు సంపాదించినట్టిదియు, అనర్థములను కలిగించు నట్టిదియునగు ధనముతో జీవనమును గడపి కొనుచున్నాడు.

"ఈ మహారాజును ప్రతిదినము సాయం ప్రాతఃకాలములందు మధురగానములతో వంది మాగధులు స్తుతించుచుండిరి. ప్రతిదినము, తపస్సంపన్నులైన మునులు వేలకొలది యీ మహారాజు సభను అలంకరించి యుండిరి. ఎనుబది యెనిమిది వేల గృహస్థులను, ఒక్కొక్కరికి ముప్పదేసిమంది దాసీజనమును ఇచ్చి పోషించుచుండెను, దానముపట్టకుండ, ఊర్ధ్వరేతస్కులైయున్న సన్న్యాసులను పదివేలమందిని ఈ రాజుపోషించుచుండెను. ఏ రాజునందు, 'అక్రౌర్యము-దయ-అన్న వస్త్ర దానము' మొన్నగున సద్గుణములు ఉండెనో, ఆ మహారాజే యిప్పుడు ఈ దురవస్థకు లోనైనాడు. అంధులను, వృద్ధులను అనాథులను, బాలకులను, దుర్గతికి లోనైన వారిని ఎందరినో పోషించుచుండెను. అట్టి ధైర్య-సత్య-దయా-దాక్షిణ్యాది సద్గుణ భూషితుడైన యుధిష్ఠిరుడు నేడు ఈ దుర్గతి పాలైనాడు. జూదపు వ్యసనములో పడి మత్స్యరాజువద్ద సేవకుడై పరతంత్రతా రూపనరకము నందుపడి క్రుగ్గుచున్నాడు.

"ఇంద్ర ప్రస్థము నందున్నప్పుడెందరో రాజులీతనికి కానుకలు బహుమానముగా నిచ్చుచుండిరి. ఇప్పుడితరుల నుండి తన బ్రతుకు దెరువుకు ధనము పొందగోరుచున్నాడు. ఎందరో రాజులితని వశములోనుండిరి.ఇప్పుడితడు ఒకనివశములోనున్నాడు.సూర్యుడువలె సమస్త భూమండలమును తన ప్రతాపము చేత తపింప జేసిన మహారాజు ఇపుడు విరాటరాజు సభలో నొకసామాన్యుడుగా మెలగుచున్నాడు. అనేకఋషులు, రాజులు ఏరాజును ఉపాసించుచుండిరో అతడిప్పుడితరుని ఉపాసించుచు అతని వద్ద ఇచ్చకములాడుచునున్న యుధిష్ఠిరుని జూచి నాకు కోపము మితిమీరుచున్నది. జీవికా నిర్వహణము కొరకు పాటు పడవలసిన దుర్గతి పొందుటకు అర్హుడు కాని ధర్మాత్ముడైన యుష్ఠిరునిచూచి యెవనికి దుఃఖము కలుగకుండును? వీరోత్తమా! సమస్త వీరలోకము, సభలో, ఏ రాజును సేవించుచుండెనో, అట్టి రాజు నేడు ఇతర నరపతిని సామాన్యుని సేవించుచున్నాడు చూడుము. ఇట్లు అనేక విధములైన దుఃఖముల చేత అనాథవలె పీడింప బడుచు శోకసాగరమునందు మునిగియున్ననన్ను భీమసేనా! ఏల చూడకున్నావు.? "

( సశేషము )




## చలం శ్మశాన సాహిత్యం

(రచన:డా. నిమ్మగడ్డ వెంకటేశ్వరరావు. పుటలు.66.మూల్యం:మూడు రూపాయలు. ప్రచురణ: స్టేట్ బుక్ క్లబ్, 189-3 ఆర్. టి. విజయనగర్ కాలనీ, హైదరాబాద్- 500028.)

స్త్రీ పట్ల, సమాజంపట్ల, చలందృష్టిని నిశితంగా పరిశీలించడమే ఈ రచన ముఖ్యోద్దేశంగా రచయిత పేర్కొన్నారు. బాగుంది, ఈ పనీయన శక్తి సామర్థ్యాలతో నిర్వహించారు. చలం సమాజం విషయంలో ఏమీ ద్రోహం చేయలేదనీ, తనకు తాను ఘోరంగా ద్రోహం చేసుకొని రమణాశ్రమ ఆధ్యాత్మిక చీకటి గుహలోకి ఈడ్వబడ్డాడనీ, పరిచయ వాక్యాలలో శ్రీ చలసాని ప్రసాదరావుగారు చెపుతున్నారు. చలానికి సామాజిక పరిణామ క్రమ సూత్రాలను గురించి శాస్త్రీయావగాహన పిసరంత కూడా లేకపోయిందనీ, బ్రిటీషు ప్రభుత్వంవారి పెట్టుబడి దారీవ్యవస్థకు చలంకొమ్ముకాసి, అదంతా గొప్ప విప్లవంగా తనను తాను మోసం చేసుకున్నాడనీ అంటున్నారు చలసానివారు. సమాజంలో విశృంఖలంగా విహరించే చెడుగులకూ, కుసంస్కారాలకూ పెట్టుబడి దారీ వ్యవస్థే కారణం కానక్కరలేదు. బ్రిటీషు వాళ్ళు రాకముందే బసవేశ్వరుడు, వేమన లాంటి వాళ్ళు, ఆధునిక కాలంలో రాజా రామ్మోహనరాయ్, వీరేశలింగం వంటి వాళ్ళు, నిర్మాణాత్మకమైన కార్యక్రమంతో, త్యాగజీవనులై సత్ఫలితాలను సాధించ గలిగారు. కాని చలం విధ్వంసక కార్యక్రమం మాత్రమే ప్రచారం చేయగలిగాడు. ధనికతత్త్వపు దుష్టత్వాన్ని పతన సంస్కృతిని ప్రజలు తెలుసుకొనే వీలులేకుండా కామాద్వైతాన్ని కిరాయి మేథావులు రచయితలు ప్రచారం చేయడం పరమార్థంగా పెట్టుకొంటారని, అధికారంలో వున్న వ్యవస్థకూడా అందుకు తోడ్పడుతుందనీ డాక్టర్ వెంకటేశ్వరరావుగారు వివరిస్తున్నారు. చలాన్ని అభిమానించేవారు, సమర్థించేవారు, చలం వ్యక్తి స్వేచ్ఛకు అత్యంత ప్రాధాన్యాన్ని ఇస్తున్నారని, చలం రచనల ప్రభావంవల తెలుగు సాహిత్యం సుసంపన్నమైందనీ అంటున్నారు. అన్నిటికన్నా విచిత్రమైన విషయం ఏమంటే పాఠకులపైన చలం ప్రభావం అనన్య సామాన్యమనీ, చలాన్ని తిట్టేవాళ్ళూ, విమర్శించే వాళ్ళూ అందరూ కూడా ఆయనగారి పుస్తకాలను పడకగదుల్లో తలగడల క్రింద దాచుకొని ఆబగా చదువుకొని రసిస్తూవుంటారని పదే పదే ఉద్ఘోషించడం ఆ విధంగా పడకగదులలో రహస్యంగా చదువుకోవడమే చలం రచనలకు న్యూనత అని ఈ మేథావులు భావించకపోవడం వింతగావుంది. యౌవ్వనంలో సతీపతి కుతూహల రహస్యాల పట్ల తరుణులందరూ ఆసక్తి కనపరుస్తారు. వాళ్ళు అలానే ఇతరులెవరూ చూడకుండా ఆ విషయాలుండే పుస్తకాలు చదువుతారు అదే విధంగా మామూలు మనిషి చెయ్యలేని పనులను పాత్రల ద్వారా చలం చేయించ గలుగుతున్నాడన్న ఆసక్తితో చదివినంత మాత్రాన చలం సాహిత్యానికి అది ఒక గొప్ప విలువగా కొందరు సాహిత్య మేథావులు పదే పదే వినిపించడంలో ఔచిత్యంలేదు. ఎందుకంటే చలం అర్ధ శతాబ్దిపాటు తన సిద్ధాంతాలను ప్రచారంచేసినా, ఆధునిక సమాజంలో మహిళలకు ఇవ్వవలసిన గౌరవంకాని, మర్యాదకాని, మన్ననకాని, ఇంకాపూర్తిగా కుదురుకోలేదనడం సత్యదూరమా ? స్త్రీకి ఇవాల్టి సమాజంలో స్వేచ్ఛలభించిందా ? కుల వ్యవస్థను నిరసించి, ప్రేమించి పెళ్ళి చేసుకో వలసిందిగా ప్రోత్సహించి, సంసారంలో సరిపడకపోతే విడాకులు తీసుకోవచ్చునని ప్రచారంచేసి, ఇవన్నీ ఆచరణ సాధ్యాలేనని నిరూపించే ప్రయత్నం ఏమన్నా చేశాడాచలం? పైన వీరేశలింగాన్ని చులకన చేయడంలో ఔచిత్యం, ఆయనకూ ఆయన ఆరాధకులకూ మాత్రమే తెలియాలి. నేటికీ నూటికి 80 మంది నిరక్షరాస్యులుగా ఉన్న యీదేశంలో, మూఢ నమ్మకాలు, కపట ప్రచారాలు, బూటకపు వేషాలు, అజ్ఞానం, అమాయకత్వం, బూకరింపులు, నోటి దురుసుతనం, బలవంతం దౌర్జన్యాలు, అభ్యుదయ పరంపరాభివృద్ధిగా సాగిపోతూనే వున్నాయని అనుకొంటూనే ఉన్నారు కదా. సమాజంలో సగమైన స్త్రీల విజ్ఞాన వికాసాలకోసం, హక్కులకోసం, చలం నడిపిన విప్లవం ఏనాటిది? దాని ఫలితాలు ఏమిటి? అర్థం చేసుకోవడం కష్టం. డాక్టర్ వెంకటేశ్వరరావుగారు చలం రచనలను, ఆయన సిద్ధాంత వాహికలుగా విశ్లేషించి చూపి, ఆయన సాహిత్యాన్ని గూర్చి కొన్ని ప్రతి పాదనలు చేశారు. చలం ఆత్మకథలో ఇలా వ్రాసుకొన్నారు.

"నా మొదటి జ్ఞాపకం ఐదేళ్ళప్పుడు మా నాన్నకొట్టడం. రెండో జ్ఞాపకం ఆయన నన్ను కొట్టటం. మూడో జ్ఞాపకం మళ్ళీ కొట్టడం. ఇంతకన్నా కొడితే యీ అర్భకుడు చచ్చిపోతాడేమో ననే భయంతో ఆపేవాడు. ఆయన దేవుణ్ణి ఏదన్నా వరమడిగితే నిరంతరం వీణ్ణికొట్టే వరమీయమని అడుగుతాడు." ఇదెక్కడైనా జరిగేనా ? కడుపున పుట్టిన కొడుకుని అంతగా హింసించే క్రూరాతి క్రూరమైన ప్రవృత్తిని అర్థం చేసుకోవడం ఎంతకష్టమో, చలం ప్రతిపాదించే సిద్ధాంతాలు, తాత్త్విక భావాలు, సామాజిక ప్రబోధాలు అర్థం చేసుకోవడం కూడా అంతకష్టం. ఒక్కసారి చంపేస్తే మళ్ళీ కొట్టడానికి వీలుండదేమోనని చిత్రహింసతో తృప్తిపడినట్టుగా ధ్వనిస్తుంది చలంమాటల్లో తండ్రి ప్రవృత్తి.

"హృదయాదేశానుసారం నడవటానికి జంకే భీరులకు గతులేవు. అభివృద్ధి లేదు అందమైన అవయవము, ఉన్నతమైన గుణముకనపడ ప్రతివ్యక్తీ తనని ఆకర్షించేట్లయితే, ఆ ఆకర్షణకన్న ఏ ఆశయం లేకపోతే, అట్లా ఆకర్షింపబడి, వీలైనపుడల్లా అనుభవించడమే పరమధర్మం" అని చలం తన స్త్రీలో వ్యక్తంచేసిన భావాలను విశ్లేషిస్తూ ఈ రచయిత జీవితానికి మూలసూత్రం అంతంలేని అశాంతి, మండే అసంతృప్తిఅని అంటున్నారు వెంకటేశ్వరరావుగారు. "నేటి సమాజంలో విద్య, వివాహం, అనే రెండు వ్యవస్థల్నీ నిర్మూలిస్తే-ఈవిల్ చాలవరకు తగ్గిపోతుంది. ఒక్కసారి

ఊహించండి. బళ్ళూలేవు. పిల్లలూ చదవటంలేదు........అపుడు డాక్టర్లుండరు. రోగాలూ ఉండవు. రోడ్లుండవు. బిల్డింగు లుండవు. ఫ్యాక్టరీలుండవు...." అని సర్వమానవ తరణోపాయం సూచించడాన్ని వెంకటేశ్వరరావు గారు తీవ్రంగా విమర్శించారు.

చలం ప్రతిభావంతుడయిన రచయితకారని ఎవరూ అనలేరు. ఆయన భావుకుడే. సౌందర్యారాధకుడే. కాని ఇప్పుడీ వెంకటేశ్వర రావుగారి పుస్తకం చదివితే, చలాన్ని అభిమానించేవారు, ఆరాధించేవారు సమాధానాలు చెప్పలేని సందేహాలు ఎదురవుతవి.

చలం తెలుగు ప్రజల్ని కసురుకుంటూ, తెలుగువారి ఆహార పదార్ధాలు కావాలంటున్నాడని అపహాస్యం చేస్తూ (పుట 60) ఇది వర్గదోపిడీ లక్షణమనీ, ఎంగిలిరేగు పండ్లు కావాలి కాని శూద్రులు వద్దన్నట్లుగా వున్నదనీ వ్యాఖ్యానించడం, బట్టతలకూ మోకాలికీ ముడిపెట్టడం లాగానేవుంది. ఇంకొక చిన్న అభిలాష, డాక్టరుగారు ఆధ్యాత్మిక విలువలు గూడా సంస్కృతి లేక నాగరకతలో ఒక భాగమంటున్నారు. దీనిగూర్చికూడా వీరు ఒక పుస్తకం వ్రాస్తే బాగుండు.

—"మంజుశ్రీ"

## యువజగతి

(కవితా సంకలనం)

(సంకలనకర్త: శ్రీ కవుల ఆంజనేయశర్మ, వెల: ఒక్కరూపాయి. ప్రచురణ: యువ జగతి ప్రచురణాలయం, అనకాపల్లి, 531002. విశాఖ జిల్లా.)

" కళ కళ కోసమే " అనే రోజులు పోయాయి. కళ సామాజిక ప్రయోజనం కోసం : కవిత్వం కళలో అంతర్భాగమే కాబట్టి దాని ప్రధాన లక్ష్యం కూడా సమాజ పురోగతియే. ఈ లక్ష్య కక్ష్యలో నిలిచి " విశ్వ శ్రేయం...." అనే ధ్యేయంతో తమ







కలాల ద్వారా గళాలు విప్పారు యీ యువజగతి లోని కవులందరూ : ఇందులో 16 మంది వర్ధిష్ణువులైన కవులు వ్రాసిన 19 కవితా ఖండికలున్నాయి. వీటిలో కొన్ని మాత్రా ఛందస్సులో వ్రాయబడినాయి. వీరు ప్రతి అంశాన్ని స్పృశించి తమ సృజనాత్మక శక్తిని, ఆసక్తిని ప్రదర్శించడానికి ప్రయత్నించారు. ఈ ప్రయత్నంలో ఎంతవరకు కృతకృత్యులయ్యారనే సత్యం కొన్ని కొన్ని ఖండికలలో స్పష్టమౌతుంది.

" మన దేశపు మన సంస్కృతి మరచి...." "పర దాస్య వ్యసనాల...." మగ్గేవారికి కొరడా చరుపులతో, "ఆవేశపు యువ రక్తం కబోదిలాటి సమాజంచే అణగద్రొక్క బడింది. ఎవరు పిచ్చివారు ?.... చెప్పండి ....?" అనే కొసమెరుపులతో " రంగుల రాట్నంలా తిరిగే యీ రంగుల లోకాన్ని- ఉండుండీ రంగులు మార్చే ఊసరవెల్లి యీ ప్రపంచం" లోని రంగులను వీరు కలాల కుంచెలతో భావ చిత్రాలు (యదార్ధ చిత్రాలు) గీశారు.

"అడుగడుగున సుడి గుండా లలముకొన్న జీవితాల

దిన మొలలను దిరుగాడే దీన జనుల

సేద దీర్చు నాదు గీతి.... "

అనేది కవికి సమాజం పట్ల వుండవలసిన బాధ్యతను గుర్తుచేసే సామాజిక స్పృహతో నిండిన ఖండిక.

"చైతన్య శిఖరానికై చేతులు చాచిన ఈ క్షణం"-అంటూ ఆశా కిరణాల వైపు నడుస్తూ- " ఎండిపోయిన బీడు జీవితాలలో తుషార పంటలు పండించాలనే " ఆశయాల తోరణాలతో వీరు యీ " యువ జగతి "ని అలంకరించి, అలరించేరు.

వస్తు వైవిధ్య ప్రదర్శనలలో, భావ ప్రకటనలో, శబ్ద వైచిత్రిలో మరికొంత పరిశ్రమిస్తే ప్రముఖ కవుల కోవలోకిచేరుకొని జవాన్ని పుంజుకుంటారీ " యువజగతి " లోని కవులు.

—గౌరీశంకర్

# జిల్లావార్తలు

## గోగు బాకలో లిఫ్ట్ ఇరిగేషన్ పథకం



ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావు ఏప్రిల్ 23 న భద్రాచలానికి 25 కి.మీ. దూరంలో వున్న గోగు బాకగ్రామంలో గోదావరి నది పై లిఫ్ట్ ఇరిగేషన్ పథకానికి శంకుస్థాపన చేశారు. ఈ పథకం అమలుకు రూ. 31లక్షలు ఖర్చు అవుతుంది. ఈ పథకం ద్వారా భద్రాచలం తాలూకాలోని ఆరు గ్రామాలకు నీటి పారుదల సౌకర్యం కలుగుతుంది. ఈ సందర్భంగా జరిగిన బహిరంగ సభలో ముఖ్యమంత్రి ప్రసంగిస్తూ రాష్ట్రంలో అపారంగా లభించే భూగర్భ జలాలను గరిష్ఠస్థాయిలో వినియోగించుకొనడానికి వీలుగా రాష్ట్రమంతటా లిఫ్ట్‌యిరిగేషన్ పథకాలను చేపట్టాలని ప్రభుత్వం భావిస్తున్నదని అన్నారు. అదిలాబాద్ నుండి రాజమండ్రి వరకు గోదావరి నదికి ఇరువైపులా ఇటువంటి పథకాలను చేపడతారని ఆయన అన్నారు. లిఫ్ట్ ఇరిగేషన్ పథకాల విషయంలో రు. 10 ల సర్వే ఛార్జీలను తొలగిస్తారని ముఖ్యమంత్రి హామీయిచ్చారు.

సభకు అధ్యక్షత వహించిన జిల్లాకలెక్టరు శ్రీ పి. వి. ఆర్. కె. ప్రసాద్ ప్రసంగిస్తూ నీటిపారుదల అభివృద్ధిపథకం క్రింద ఇల్లెందు తాలూకాలోని సున్నపురాయి నిధుల ప్రాంతాలలో భూగర్భ జల విషయాల శాఖ 18 బోరింగు బావులను త్రవ్వే విధంగా చూడాలని ముఖ్యమంత్రికి విజ్ఞప్తి చేశారు.

తరువాత ముఖ్యమంత్రి పారిశ్రామిక ప్రాతిపదిక సంబారాల కార్పొరేషన్ పాల్వంచలో చేపట్టిన పారిశ్రామిక గృహ సముదాయానికి శంకుస్థాపన చేశారు. ఈ పథకం క్రింద రు. 23.7 లక్షల ఖర్చుతో 153 ఇండ్లను నిర్మిస్తారు. కొత్త ఢిల్లీలోని గృహనిర్మాణ పట్టణాభివృద్ధి కార్పొరేషన్ ఇందుకు ఆర్థిక సహాయం అందజేస్తుంది. అన్ని విధాలైన సౌకర్యాలతో ఇక్కడ పారిశ్రామిక గృహసముదాయం ఉండడం గూర్చి కలెక్టరు వివరించారు.

ఈ సందర్భంగా జరిగిన బహిరంగ సభలో ముఖ్యమంత్రి ప్రసంగిస్తూ కొత్తగూడెం, పాల్వంచ ప్రాంతాల సమగ్రాభివృద్ధికి ఒక బృహత్ ప్రణాళికను తయారు చేయడానికి ప్రభుత్వము గత వారం ఒక సంఘాన్ని ఏర్పాటుచేసిందని వెల్లడించారు. పారిశ్రామిక వేత్తలు తమ పరిశ్రమలలో స్థానికులను మాత్రమే నియమించుకోవాలని ముఖ్యమంత్రి ఉద్బోధించారు.

## మధిర సమీపంలో రోడ్డు వంతెనకు శంకుస్థాపన

ముఖ్యమంత్రి శ్రీ జె. వెంగళరావు, ఏప్రిల్ 22 న సాయంత్రం మధిర సమీపంలో వైరా నదిపై రు. 30 లక్షల ఖర్చుతో నిర్మిస్తున్న రోడు వంతెనకు శంకుస్థాపన చేశారు. ఈ వంతెన ద్వారా మధిర-నందిగామలమధ్య దూరం 50 కిలోమీటర్లకు తగ్గుతుంది. ముఖ్యమంత్రి ఈ సందర్భంగా ప్రసంగిస్తూ మధిరలో త్వరలోనే ఒక అగ్నిమాపక దళం కేంద్రం, బస్‌స్టాండ్ ఏర్పాటు చేయబడుతాయని అన్నారు. ప్రజలు రు. 4 లక్షలు విరాళంగా సేకరించే పక్షంలో ఇక్కడ ఒక డిగ్రీ కళాశాల కూడా నెలకొల్పుతారని ఆయన అన్నారు. 1978 జులై నాటికి బోనకల్లు కాల్వలకు, 1979 జులై నాటికి మధిర కాల్వలకు నాగార్జునసాగర్ జలాలను విడుదల చేస్తారని ముఖ్యమంత్రి పేర్కొన్నారు. నాగార్జునసాగర్ జలాలు ఈ ప్రాంతాలకు అందగానే మధిరలో ఒక్క చక్కెర ఫ్యాక్టరీ నెలకొల్పుతారని ఆయన హామీ యిచ్చారు.

పి.డబ్ల్యు.డి. మంత్రి శ్రీ చనుమోలు వెంకట్రావు సభకు అధ్యక్షత వహిస్తూ మధిర నుండి నందిగాను రోడ్డు అభివృద్ధికి రు. 1.5 కోట్లు ఖర్చు చేస్తారని ఇందువల్ల పరిసరాలోని 30 గ్రామాలకు ప్రయోజనం కలుగుతుందని అన్నారు. ఈ సంవత్సరం రాష్ట్రంలో రోడ్డు నిర్వహణకు రు. 25 కోట్లు లభిస్తాయని మంత్రి వెల్లడించారు. ఇటీవల మరణించిన ఎగ్జిక్యూటివ్ శ్రీ శ్రీ రాములు సేవలకు మంత్రి జోహార్లు అర్పించారు.

అంతకుముందు ముఖ్య మంత్రి కొత్త గూడెంలో రుభవనానికి ఖర్చుతో నిర్మిస్తున్న వ్యవసాయ అభివృద్ధి బ్యాంకు శంకుస్థాపన చేశారు. మధిర తాలూకాలో నాగార్జునగ్రామీణ బ్యాంకు మంజూరు చేసిన రు.7.18 లక్షల రుణాలను రైతులకు పంపిణీ చేశారు. వెనుకబడిన వర్గాలకు యిండ్ల స్థలాలకు 13 భూమి పట్టాలను కూడా ముఖ్యమంత్రి పంపిణీ చేశారు.

## సాల్వెంట్ ఎక్స్‌ట్రాక్ట్ ప్లాంటుకు ప్రారంభోత్సవం

ముఖ్యమంత్రి శ్రీ జె. వెంగళరావు, ఏప్రెల్ 22 న ఖమ్మంలో ప్రైవేటు రంగంలో రు. 60.40 లక్షలతో కూడిన శ్రీ రాధాకృష్ణ సాల్వెంట్ ఎక్స్‌ట్రాక్షన్ ప్లాంటుకు ప్రారంభోత్సవం చేస్తూ రాష్ట్రంలో విద్యుచ్ఛక్తి ఉత్పాదనకు రు. 140 కోట్లు ఖర్చు చేస్తారని

గత సంవత్సరం రు. 107 కోట్లు ఖర్చు చేశారని అన్నారు. కొత్తగూడెం థర్మల్ స్టేషన్ మరోయూనిట్ పని ప్రారంభించగానే నెలరోజులలో 30 శాతం విద్యుచ్ఛక్తి కోతను తీసివేస్తారని తమ ఆశాభావాన్ని వెల్లడించారు. గత సంవత్సరం 105 లఘు పరిశ్రమలను నెలకొల్పినందుకు పరిశ్రమల శాఖను ముఖ్యమంత్రి అభినందించారు.

అంతకుముందు ముఖ్యమంత్రి స్వయం ఉపాధి పథకం క్రింద పారిశ్రామిక అభివృద్ధి ప్రాంతంలో రు. 5.25 లక్షల ఖర్చుతో కూడిన గ్రాఫైట్ ప్లాంటుకు శంకుస్థాపన చేశారు. ఆ తరువాత జిల్లాలో 2,400 బావులకు సామూహిక బావుల త్రవ్వకం క్రింద ప్రారంభోత్సవం చేశారు. సన్నకారు రైతుల అభివృద్ధి సంస్థ, నాగార్జున గ్రామీణ బ్యాంకు, సెంట్రల్ బ్యాంక్ ఆఫ్ ఇండియా, వ్యవసాయాభివృద్ధి బ్యాంకు, ఈ పథకానికి ఆర్థిక సహాయం చేస్తున్నాయి. తిరుమలాయపాలెం పంచాయతీ సమితి కార్యాలయంలో ముఖ్యమంత్రి సన్నకారు రైతులకు రు. 32 లక్షలకు చెందిన 640 ఋణాలను పంపిణీ చేశారు. ఖమ్మం తాలూకాలోని 6 గ్రామాలకు చెందిన వెనుకబడిన వర్గాలకు 435 ఇళ్ళ స్థలాల పట్టాలను పంపిణీచేశారు.

బహిరంగసభలో ముఖ్యమంత్రి ప్రసంగిస్తూ సన్నకారు రైతులు, వెనుకబడిన వర్గాల అభివృద్ధికి గణనీయమైన సేవ చేసినందుకు జిల్లా కలక్టరును, సన్నకారు రైతుల అభివృద్ధి సంస్థ ప్రాజెక్టు అధికారిని, నాగార్జున గ్రామీణ బ్యాంకు అధ్యక్షుని, యితర జిల్లా అధికార్లను అభినందించారు.

వెనుకబడిన వర్గాలకు ఈ సంవత్సరంలో ఇళ్ళస్థలాల కేటాయింపుకు రు. 20 కోట్లు ఖర్చు చేస్తారని ముఖ్యమంత్రి వెల్లడించారు. నాగార్జునసాగర్ కుడి, ఎడమకాలువల నిర్మాణం 1981 నాటికి పూర్తి అవుతుంది. తద్వారా 35 లక్షల ఎకరాల ఆయకట్టుకు నీటి రఫరా జరుగుతుంది. ప్రపంచ బ్యాంకు సహాయంతో ఈ సంత్సరం ప్రధాన కాల్వపై 20 కోట్లు ఖర్చు చేస్తారు. 1977 జూలై నాటికి ఖమ్మం తాలూకాలోని 19 వ బ్రాంచి కాల్వనుండి 40 వేల ఎకరాలకు నీరు విడుదల చేస్తారు. నాగార్జున సాగర్ నీరు సరఫరా జరిగిన తరువాత వైద్యా, బోనకల్లు, మధిర తాలూకాలలో కూడా చక్కెర ఫ్యాక్టరీలు ఏర్పాటు చేస్తారని ముఖ్యమంత్రి అన్నారు.

## గిద్దలూరు గృహనిర్మాణ సహకార సంఘానికి శంకుస్థాపన

ఆర్థిక, సమాచార శాఖ మంత్రి శ్రీ పిడతల రంగారెడ్డి ఏప్రిల్ 23 న గిద్దలూరులో పి.ఆర్.నగర్ సహకార గృహనిర్మాణ సంఘానికి శంకుస్థాపనచేస్తూ యీ కాలనీలో రు. 20 లక్షల అంచనా ఖర్చుతో నూరు ఇళ్లను నిర్మిస్తారని అన్నారు. 2 లక్షల ఖర్చుతో రక్షిత మంచి నీటి పథకం కూడా యీ కాలనీకి మంజూరు చేయ బడిందని మంత్రి వెల్లడించారు. రు. 40 లక్షల 79 వేల అంచనా ఖర్చుతో 38 మధ్య ఆదాయ గృహాలు, 22 స్వల్పాదాయ గృహాల నిర్మాణం ప్రారంభించారు. ఈ పట్టణం విద్యావిషయకంగానూ, పారిశ్రామికంగానూ, సత్వరాభివృద్ధి చెందుతున్న దృష్ట్యా యీ కాలనీకి మంచి భవిష్యత్తు ఉంటుందని మంత్రి తమ ఆశాభావాన్ని వ్యక్తం చేశారు.

గిద్దలూరు భూమి అభివృద్ధి బ్యాంకు అధ్యక్షులు శ్రీ చప్పిడి వెంగయ్య ఉత్సవానికి అధ్యక్షత వహించారు.

## నివేశన స్థలాల పంపిణీ

ఏప్రిల్ 12 న అద్దంకి తాలూకాలోని కూకుట్ల పల్లి గ్రామంలో హరిజన, గిరిజన సమాఖ్య సమావేశం జరిగింది. ఈ సమావేశానికి గ్రామ సర్పంచ్ శ్రీ ఇప్పల నాసర రెడ్డిగారు అధ్యక్షత వహించి ఒంగోలు సబ్‌కలెక్టరు శ్రీ వి. యస్.సంపత్ గారిచే మంజూరు చేయబడిన పట్టాలను ఎ. 13-53 సెంట్ల భూమిని 185 మంది హరిజనులకు గిరిజనులకు నివేశన స్థలము కొరకు పంచారు. ఈ సమావేశంలో ఆంధ్ర ప్రదేశ్ యానాది సంఘ కార్య దర్శి శ్రీ దొంతి సుబ్బారావు మాట్లాడుతూ ప్రభుత్వం యిచ్చిన భూమిని అన్యాక్రాంతం చేయక సద్వినియోగం చేసుకోవలసిందని కోరారు.

హరిజన, గిరిజనసంఘ అధ్యక్షులు శ్రీ పులి లక్ష్మయ్య వందన సమర్పణ చేశారు.

## రెండు బస్‌స్టేషన్ సముదాయాలకు శంకుస్థాపన

ముఖ్య మంత్రి శ్రీ జె. వెంగళరావు, ఏప్రిల్ 20 న నర్సంపేట, పర్కాలలో రెండు బస్ స్టేషన్ల సముదాయాలకు, శాంపేటలో రక్షిత మంచినీటి సరఫరా పథకానికి శంకుస్థాపన చేశారు. నర్సంపేటలో రు. 17 లక్షల ఖర్చుతో బస్ డిపోతో సహా బస్ స్టేషన్ సముదాయం, పర్కాలలో రు. 4 లక్షల ఖర్చుతో బస్ స్టేషన్, శాంపేటలో రు. 2.47 లక్షల ఖర్చుతో రక్షిత మంచి నీటి సరఫరా పథకాలను అమలు జరుపుతున్నారు.

ముఖ్య మంత్రి నర్సంపేటలో 46 మందికి 4.37 ఎకరాల విస్తీర్ణంగల యిండ్ల స్థలాల పట్టాలను, వెనుకబడిన వర్గాలకు చెందిన 88 మందికి రు. 1.11 లక్షలు ఋణాలను పంపిణీ చేశారు.

ముఖ్యమంత్రి నిధి నుండి రు. 2,000 ల విరాళాన్ని ఇటీవల అనుమానాస్పదమైన పరిస్థితులలో మరణించిన ఒడేలు అనే హరిజన వ్యక్తి కుటుంబానికి యిస్తూ వారికి 4 ఎకరాల భూమిని కూడా కేటాయించాలని ముఖ్య మంత్రి కోరారు.

బహిరంగ సభలో ముఖ్య మంత్రి ప్రసంగిస్తూ వెనుకబడిన వర్గాల సంక్షేమానికి అమలు జరుపుతున్న కార్యక్రమాలను ఈ సంవత్సరం మరింత ముమ్మరం చేస్తారని అన్నారు. ఇండ్లులేని వారందరికీ కులవర్గ ప్రసక్తి లేకుండా మరింత ఎక్కువ మందికి కేటాయిస్తారని అన్నారు. భూకమతాలకు సంబంధించిన అధికారులతో సహకరిస్తూ మిగులు భూముల పంపిణీలో ప్రజలు పాలొనాలని ఆయన అన్నారు.

## అనంతపురం జిల్లాలో భూముల కేటాయింపు

మార్కెటింగ్, హరిజన సంక్షేమ శాఖా మంత్రి శ్రీ పి. మహేంద్రనాథ్ అనంతపురం జిల్లా సింగనమల్ సమితిలోని నాగలగుడం గ్రామంలో ఏప్రిల్ 20 న 4.19 ఎకరాల విస్తీర్ణానికి చెందిన 68 యిండ్ల స్థలాల పట్టాలను 4 ఎకరాల విస్తీర్ణానికి చెందిన 24 భూమి కేటాయింపు పట్టాలను షెడ్యూలు కులాల, షెడ్యూలు తెగల ప్రజలకు పంపిణీ చేశారు.

పునరవాసశాఖ మంత్రి శ్రీమతి ఎం. లక్ష్మీదేవి, రూ. 11 వేలు విలువచేసే 11 ఎడ్లబండ్లను 11 మంది సన్నకారు రైతులకు పంపిణీ చేశారు.

మున్సిపల్ పరిపాలనా శాఖ మంత్రి శ్రీ చల్లా సుబ్బారాయుడు రూ. 14,000 విలువచేసే 14 జతల నాగేటి యెద్దులను సన్నకారు రైతులకు పంపిణీ చేశారు.

సభకు అధ్యక్షత వహించిన పార్లమెంటు సభ్యులు శ్రీ డి. పుల్లయ్య ప్రసంగిస్తూ అనేక గ్రామాలలో బండ్లు, ఎడ్లు, పాడిపశువుల సరఫరాకు అనంతపురంలోని సెంట్రల్ బ్యాంకు రుణాలను మంజూరు చేసిందని అన్నారు. క్షామపీడిత, అభివృద్ధి కార్యక్రమాల క్రింద రూ. 108 లక్షలు మంజూరు చేసినందుకు ప్రభుత్వానికి ఆయన కృతజ్ఞతలు తెలియ జేశారు.

శ్రీమతి ఎం. లక్ష్మీదేవి ప్రసంగిస్తూ అనంతపురం జిల్లాలో క్షామపీడిత కార్యక్రమాల క్రింద పెద్ద మొత్తాలను ఖర్చు చేయడానికి ముఖ్యమంత్రి కృతనిశ్చయంతో ఉన్నారని అన్నారు.

## అనంతపురంలో మార్కెట్ సముదాయానికి శంకుస్థాపన

హరిజన సంక్షేమ, మార్కెటింగ్ శాఖా మంత్రి శ్రీ పి మహేంద్రనాథ్ ఏప్రిల్ 19న అనంతపురంలో రూ. 4 లక్షల ఖర్చుతో 20 ఎకరాల విస్తీర్ణంలో నిర్మిస్తున్న మార్కెట్ సముదాయానికి శంకుస్థాపన చేస్తూ రాష్ట్రంలో 196 మార్కెట్ సంఘాలు వున్నాయని అన్నారు. రాష్ట్రంలో వ్యవసాయ మార్కెట్ సంఘాలు సమకూరుస్తున్న మార్కెట్ సౌకర్యాలను వినియోగించు కోవాలని రైతులకు విజ్ఞప్తి చేశారు.

మున్సిపల్ పరిపాలన శాఖమంత్రి శ్రీ చల్లా సుబ్బారాయుడు మార్కెట్ యార్డులో షెడ్డుల నిర్మాణానికి శంకుస్థాపన చేశారు.

పునరావాస శాఖామంత్రి శ్రీమతి ఎం. లక్ష్మీదేవి, మార్కెట్ సంఘ భవన కార్యాలయానికి శంకుస్థాపన చేశారు.

## హాస్టల్ భవనానికి ప్రారంభోత్సవం

హరిజన సంక్షేమ, మార్కెటింగ్ శాఖామంత్రి శ్రీ పి. మహేంద్రనాథ్, చిన్నతరహా పొదుపు శాఖామంత్రి శ్రీమతి ఎం. లక్ష్మీదేవి 4లక్షల చొప్పునఖర్చుతో నిర్మించబడిన ప్రభుత్వ సాంఘిక సంక్షేమ హాస్టల్ భవనాల 1, 2 బ్లాకులకు బాలబాలికల అదనపు భవనాలకు ఏప్రిల్ 19న అనంతపురంలో ప్రారంభోత్సవం చేశారు.

ఉత్సవ సభకు అధ్యక్షత వహించిన మున్సిపల్ పరిపాలన శాఖా మంత్రి శ్రీ చల్లా సుబ్బారాయుడు, ప్రసంగిస్తూ యిటువంటి రాయితీలను యితర తరగతి ప్రజలకు కూడా అందజేస్తారని అన్నారు.

శ్రీ పి. మహేంద్రనాథ్ ప్రసంగిస్తూ యితర తరగతి ప్రజలకు కూడా యిండ్ల స్థలాలను కేటాయిస్తారని అన్నారు.

జిల్లా కలక్టరు శ్రీ కె. యస్. శర్మ ప్రసంగిస్తూ బడుగువర్గ ప్రజల ప్రయోజనార్థం 511 సామూహిక సేద్యపు బావులు, 23 హాస్టల్ భవనాలను చేపట్టారని అన్నారు.

## రక్షిత మంచినీటి పథకానికి శంకుస్థాపన

రాయలసీమ ప్రణాళికా సంఘం అధ్యక్షులు శ్రీ ఎస్. . వీరరాఘవులు నాయుడు ఏప్రిల్ 24న అనంతపురం జిల్లా వీరపానకాల గ్రామంలో ఉరవకొండ సబ్ తాలూకాలోని వీరపానకాల మరి 3 యితర గ్రామాలకు చెందిన సమగ్ర రక్షిత మంచినీటి పథకానికి శంకుస్థాపనచేస్తూ ఈ పథకానికి రు. 19 లక్షలు ఖర్చు అవుతుందని అంచనా వేశారు. సాధ్యమైనంత త్వరలో యీ పథకం అమలు పూర్తి అవుతుందని తమ ఆశాభావాన్ని వెల్లడించారు. ఇంద్రావతి గ్రామంలో రు. 1,70,000 ఖర్చుతో నిర్మిస్తున్న లిఫ్ట్ యిరిగేషన్ పథకానికి కూడా ఆయన శంకుస్థాపన చేశారు. ఇందువల్ల ఖరీఫ్ పంటకాలంలో 200 ఎకరాల ఆయకట్టుకు ప్రయోజనం కలుగుతుంది. చిన్నహోరూర్ గ్రామంలో కూడా రక్షిత మంచినీటి పథకానికి ఆయన ప్రారంభోత్సవం చేశారు.

## చిన్నతరహా పొదుపు ఉద్యమంలో నెల్లూరు జిల్లాకు అగ్రస్థానం

నెల్లూరు జిల్లాలో 1976-77 సంవత్సరంలో రు. 2.47 కోట్ల మేరకు జాతీయ పొదుపు డిపాజిట్లను సేకరించారని జిల్లా కలెక్టరు శ్రీ సి. అర్జునరావు ఏప్రిల్ 19న నెల్లూరులో అన్నారు. గత సంవత్సరంకన్నా యిది 3 శాతం ఎక్కువ. జిల్లా కలెక్టరు డిపాజిట్ల వివరాలను తెలియజేస్తూ జాతీయ సేవింగ్స్ సర్టిఫికెట్లక్రింద రు. 11.4 లక్షలు, పోస్టాఫీసు టైమ్ డిపాజిట్ల పథకం క్రింద రు. 11.48 లక్షలు పొదుపు చేశారని అన్నారు. సేవింగ్స్ బ్యాంకు అకౌంట్లు రు. 2 కోట్లకు పెరిగాయి.

ఈ విధమైన విజయాలను సాధించినందుకు, యిందుకు నిరంతరం కృషి చేసినందుకు జాతీయ పొదుపు శాఖ అధికార్లను, పంచాయతీరాజ్ శాఖ అధికార్లను కలెక్టరు అభినందించారు.

జిల్లా చిన్నతరహా పొదుపు శాఖ అధికారి శ్రీ ఎ. సత్యనారాయణ మాట్లాడుతూ 1976-77లో ప్రత్యేక ఉద్యమం నిర్వహణ ఫలితంగా 7,170 కొత్త పోస్టాఫీస్ సేవింగ్స్ బ్యాంక్ అకౌంట్లు,

689 రికరింగ్ డిపాజిట్ల అక్కౌంట్లను జిల్లాలో ప్రారంభించారని అన్నారు.

1977–78లో కూడా జాతీయ పొదుపు పథకాలను జిల్లాలో తీవ్రతరంచేసి మరిన్ని ఎక్కువ ఫలితాలను సాధించాలని అధికార్లను కలెక్టరు ఉద్బోధించారు.

## సామాజిక ఆరోగ్య విషయాల పథకానికి ప్రారంభోత్సవం

ఆరోగ్యశాఖ మంత్రి శ్రీ కె. రాజమల్లు, ఏప్రిల్ 22న మెదక్ జిల్లా నర్సాపూర్ తాలూకాలోని సివ్వంపేట ప్రాథమిక ఆరోగ్య కేంద్రంలో సామాజిక ఆరోగ్య విషయాల కార్యకర్తల కార్యక్రమానికి ప్రారంభోత్సవం చేశారు. ప్రపంచ ఆరోగ్య సంస్థ రాష్ట్ర ప్రభుత్వ సమిష్టి కృషి ఫలితంగా యీ సామాజిక ఆరోగ్య విషయాల కార్యక్రమం రూపొందింది. దేశంలో ఇటువంటి కార్యక్రమాన్ని ప్రప్రథమంగా అమలు జరుపుతున్నారు. అభిరుచి ప్రాతిపదికగా గ్రామాలలోనే యీ కార్యక్రమాలను అమలు జరుపుతారు. ఆరోగ్య పారిశుధ్య విషయాలలోనూ ప్రథమ చికిత్సలోనూ ఉత్సాహవంతులైన కార్యకర్తలకు పారితోషికాలకు అవసరమయ్యే ఖర్చులు ప్రపంచ ఆరోగ్య సంస్థ భరిసుంది.

## వరంగల్‌లో ఆరు సూత్రాల పథకం సమీక్ష

తెలంగాణా ప్రణాళిక అభివృద్ధి సంఘం అధ్యక్షులు శ్రీ సి. జగన్నాధరావు, ఏప్రిల్ 23న వరంగల్లులో మాట్లాడుతూ 1974 నుండి 77 ఆఖరు వరకు గత మూడు సంవత్సరాలలో ఆరు సూత్రాల పథకం కార్యక్రమం కేంద్ర సహాయం క్రింద వరంగల్లు జిల్లాలో 1.42 కోట్లు ఖర్చు చేశారని ఇది జిల్లాకు కేటాయించిన రు. 2.14 కోట్లలో 66 శాతం అని అన్నారు. వరంగల్లులోని జిలా పరిషత్తు హాలులో కలెక్టర్ శ్రీ ఎస్. రే అధ్యక్షతన జరిగిన ఆరు సూత్రాల పథకం జిల్లా సమీక్షా సంఘ సమావేశంలో ఆయన ఈ విషయాలను వెల్లడించారు. కేటాయించిన నిధులలో 84 శాతం వినియోగించుకొని గ్రామీణ విద్యుదీకరణ, చిన్నతరహానీటిపారుదల, మత్స్యపరిశ్రమ, ఆర్థిక కార్యక్రమాలను అమలు జరిపారని ఆయన అన్నారు. వెనుకబడిన ప్రాంతాల సత్వరాభివృద్ధికి అధికారులు, అనధికారులు సహకరించాలని ఆయన విజ్ఞప్తి చేశారు.

## చక్కెర ఫ్యాక్టరీకి శంకుస్థాపన

ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావు రాజేశ్వర పురం గ్రామంలో రు. 7 కోట్ల ఖర్చుతో కూడిన పాలేరు సహకార చక్కెర ఫ్యాక్టరీకి శంకుస్థాపన చేశారు. 1978లో పని ప్రారంభించిన తరువాత యిక్కడ రోజుకు 1550 టన్నుల చెరుకు వినియోగించే శక్తి కలిగియుంటుంది. ఈ ఫ్యాక్టరీ పూర్తిగా అభివృద్ధి చేయబడిన తరువాత ఆంధ్రప్రదేశ్‌లో అతి పెద్ద చక్కెర ఫ్యాక్టరీగా అలరారుతుందన్న ముఖ్యమంత్రి తమఆశాభావాన్ని వ్యక్తం చేశారు.

ఉత్సవానికి అధ్యక్షత వహించిన చక్కెర ఫ్యాక్టరీల శాఖా మంత్రి శ్రీ కె.బి. నరసప్ప ప్రసంగిస్తూ వచ్చేనెల నంద్యాల, హిందూపూరులలో మరో 2 చక్కెర ఫ్యాక్టరీలకు శంకుస్థాపన జరుగుతుందని అన్నారు. చక్కెర ఉత్పత్తి విషయంలో దేశంలో ఆంధ్రప్రదేశ్ నాల్గవ రాష్ట్రం అని క్రొత్తగా ఆ ఫ్యాక్టరీలు ఉత్పత్తిని ప్రారంభించిన తరువాత దానికి ప్రథమస్థానం లభిస్తుందని అన్నారు.

జిల్లా కలక్టరు శ్రీ పి.వి.ఆర్.కె. ప్రసాద్ సభికులకు స్వాగతం చెప్పుతూ వాటాధనంగా రు. 75 లక్షలు సేకరిస్తారని అన్నారు. ఈ సంవత్సరం పాలేరు ఆయకట్టు ప్రాంతంలో 800 ఎకరాలలో చెరకు సేద్యం చేస్తారని అన్నారు.

చిన్నారం గ్రామానికి చెందిన వాటాదారులకు సర్టిఫికెట్లను ముఖ్యమంత్రి పంపిణీ చేశారు.

## తమ్మిలేరు రిజర్వాయరు ప్రాజెక్టు

ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావు ఏప్రిల్ 24న పశ్చిమ గోదావరి జిల్లా చింతలపూడి తాలూకాలోని దమ్మాజీ గూడెంలో ప్రసంగిస్తూ 1978 జూన్ నాటికి తమ్మిలేరు రిజర్వాయరు ప్రాజెక్టు ద్వారా 9 వేల ఎకరాల విస్తీర్ణానికి నీటి సరఫరా జరుగుతుందని ప్రాజెక్టు నిర్మాణం పూర్తి చేయడానికి అవసరమైన నిధులను కేటాయిస్తారని అన్నారు. అంతకు ముందు ముఖ్యమంత్రి తమ్మిలేరు రిజర్వాయరు ప్రాజెక్టును తనిఖీ చేశారు.

దమ్మాజీ గూడెంలో 10 వేల ఖర్చుతో నిర్మించిన పశు వైద్యశాలకు ముఖ్యమంత్రి ప్రారంభోత్సవం చేశారు. ఎర్రగుంట్ల పాలెంలో 60 వేల ఖర్చుతో నిర్మించిన జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాలకు ప్రారంభోత్సవం చేశారు. ఎగువ ప్రాంతాల ప్రజలు గొర్రెల పెంపకం, కోళ్ల పెంపకం చేపట్టాలని ముఖ్యమంత్రి హితవు చెప్పారు. అంతకు ముందు ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావు పశ్చిమ గోదావరి జిల్లా బలహీన వర్గాల వారి భూమి వనరుల అభివృద్ధి సహకార సంఘం ఆధ్వర్యంలో ఆలీపల్లి గ్రామంలో రు. 34 వేల ఖర్చుతో కూడిన లిఫ్ట్ ఇరిగేషన్ పథకానికి ప్రారంభోత్సవం చేశారు. ప్రాథమిక ఆరోగ్య భవనానికి కూడ శంకుస్థాపన చేశారు. ముఖ్యమంత్రి అక్కడికక్కడ నిర్ణయాలు తీసుకొని శాసన సభ్యులు సమర్పించిన సమస్యలను కొన్నింటిని పరిష్కరించారు. 173 ఇళ్ల స్థలాల పట్టాలు గ్రామస్థులకు ముఖ్యమంత్రి పంపిణీ చేశారు.

PRINTED BY THE DIRECTOR OF PRINTING, GOVT. OF ANDHRA PRADESH, AT THE GOVT. CENTRAL PRESS, HYDERABAD.
PUBLISHED BY THE DIRECTOR OF INFORMATION & PUBLIC RELATIONS ANDHRA PRADESH, HYDERABAD.

# స్వీయ చరిత్ర ఆధారంగా - బుజ్జాయి

ఆ పిల్లల ఊరు బైట ఉండడం చేత అక్కడ బాలవితంతువుల పిల్లలను సాయం చేయకుండా ఉంచడము మంచిది కాదని వీరేశలింగము ఆ పిల్లలను తన ఇల్లోనే పెట్టుకుని లండన్ మిషన్ చదువుకొనుటకు పెట్టాడు. భార్య ఈ పిల్లలను ఆదరంగా చూసేది




రాజధాని కళాశాలలో వీరేశలింగాన్ని ఉపాధ్యాయుడుగా నియమించారు



1898లో హైందవ మహా 24 సభలు జరిగాయి. ఆ సభలలో రెనడే వీరేశలింగానికి—




1900లో మద్రాసులో జరిగిన చెన్నరాజధాని దేశీయ సాంఘిక మహా సభలకు వీరేశలింగం అధ్యక్షుడిగా చేశారు




ఆ సభలలో వీరేశలింగం ఇచ్చిన ఉపన్యాసం రెవరెండ్ మర్డాక్ అనే యూరోపియను వ్రాసిన ఆంగ్ల గ్రంథంలో ఉదహరించారు.

1902లో గుంటూరులో ప్రథమ వితంతు వివాహం జరిగింది. దానికి వీరేశలింగం సతీసమేతంగా హాజరయ్యాడు.



వీరేశలింగానికి సంఘసంస్కరణం సాహిత్యరంగాలలో కృషి కొనసాగిస్తూ ప్రతి విషయమూ తెలుసుకుందామనే కుతూహలం ఉండేది. జ్యోతిష్యశాస్త్రము ఆయుర్వేదశాస్త్రము చదివాడు. చాలా డబ్బు ఖర్చు పెట్టి ఒక అస్థిపంజరము తెచ్చాడు.

దాన్ని బాగా పరిశీలించి ఆరోగ్య శాస్త్రము శారీర శాస్త్రము కూడా పుస్తకాలు వ్రాసి ప్రకటించాడు



జ్యోతిష్యశాస్త్రము గూర్చి ఇంగ్లీషులోనూ సంస్కృత భాషలోనూ చదివి. దూరదర్శిని యంత్రంతో పరిశీలించి పుస్తకాలు వ్రాశాడు



జంతుస్వభావ చరిత్రము వ్రాశాడు




తంజావూరులో ఎన్నో తాళపత్ర గ్రంథాలున్నాయని తెలిసి అక్కడకు వెళ్ళాడు. రాత్రనక పగలనక చదివాడు



